# మహిళా శక్తికి సాన





తారాతీరం

బాలీవుడ్ కం హాలీవుడ్ బ్యూటీ ప్రియాంక చోప్రా ఇపుడు యాక్టింగ్ మాత్రమే కాకుండా.. మరో విభాగంలోకి అడుగు పెట్టింది. పర్పుల్ పెబుల్ పిక్చర్స్ అంటూ బ్యానర్ స్టార్ట్ చేసి.. వరుసగా సినిమాలను నిర్మించేస్తోంది. ఇప్పటికే మరాఠీ, పంజాబీ చిత్రాలను ప్రొడ్యూస్ చేసిన ప్రియాంక... ఇపుడు ఒకేసారి మూడు భాషల్లో సినిమాలు తీసేస్తోంది. ఈ చిత్రాలకు దర్శకులు మహిళలే కావటం విశేషం. అన్నీ చిల్డ్రన్స్ ఫిలిమ్స్ కావటం మరో విశేషం. నేను ఇపుడు ఉన్న సిట్యుయేషన్‌లో సినిమా రంగానికి ఏదైనా చేయాలని అనుకుంటున్నా. మన దేశంలో విభిన్న సంస్కృతుల కారణంగా ఎన్నెన్నో కథలు ఉంటాయి.. నేను ఇపుడు నిర్మిస్తున్న ప్రతి చిత్రం చిన్నారుల హృదయాలను తాకేలా ఉంటుంది.. అని చెబుతోంది... ప్రియాంక చోప్రా.

## బేబీ తర్వాత

బాలీవుడ్‌లో హిట్ సినిమాలను సిరీస్‌గా మలచడమో.. సీక్వెల్స్ చేయడమో.. సాధారణమే.. కానీ ప్రీక్వెల్ వైపులో మాత్రం కథలు రావటం అరుదుగానే జరుగుతుంది.. రెండేళ్ల క్రితం బేబీ అంటూ అక్షయ్‌కుమార్‌తో కలిసి నీరజ్ పాండే సెన్సేషన్ సృష్టించారు. ఈ సినిమాలో బేబీ అనే టీంలో తాప్సీ ఒక భాగం అంటే.. ఆ జట్టులోకి ఈ షబానా ఖాన ఎలా వచ్చింది.. అంటూ బేబీకి ముందు స్టోరీని నామ్ షబానా పేరుతో తీసుకొస్తున్నారు.. అపుడా చిత్రం ట్రైలర్ రిలీజ్ కాగా. విపరీతమైన రెస్పాన్స్ వస్తోంది.. షబానా ఒక సాధారణ యువతే. ఏజన్సీ చెప్పిన పని ఎంత డేంజర్ అయినా.. ఎలా డీల్ చేసింది అనే కాన్సెప్ట్ నామ్ షబానా.. స్టోరీనే కాదు. ప్రతి విజువల్‌ని ఆకట్టుకునేలా తీశారట.

## మైండ్ బ్లాక్

సెన్సేషన్స్ సృష్టించటంలో బాలీవుడ్ బ్యూటీ కంగనా రనౌత్ ఆరితేరిపోయింది.. అటు యాక్టింగ్, ఇటు టాలెంట్ మరోవైపు ఫొటో షూట్లతో, ఇంకోవైపు కామెంట్స్‌తో ఇలా అమ్మడిని కదిపితే చాలు ఏదో ఒక సెన్సేషన్ పాయింట్ కచ్చితంగా ఉంటుంది. తాజాగా ఈ క్వీన్ ఓ మ్యాగజైన్‌కి ఫొటో షూట్ చేసింది. బ్రైడల్ వేర్ స్పెషల్ థీమ్‌తో ఫొటో షూట్స్ చేసే ఈ మ్యాగజైన్ కోసం కంగనా ఫొటో ఫోజ్ ఇచ్చిన తీరు చూస్తుంటే మైండ్ బ్లాక్ అవాల్సిందే.. అంతగా అదరగొట్టేసిందంటూ అభిమానులు పిచ్చెక్కిపోతున్నారు.



# మళ్లీ వెండితెరపైకి..

ప్రేమంటే ఇదేరా.. మూవీలో వెంకటేష్ సరసన నటించి సినీ అరంగేట్రం చేసిన భామ ప్రీతి జింటా.. బాలీవుడ్‌లో మాత్రం టాప్ హీరోయిన్‌గా వెలిగిన ప్రీతి గత ఏడాది పెళ్లి చేసుకుని సెటిల్ అయ్యింది. ఇపుడు భయ్యాజీ సూపర్‌హిట్ అనే మూవీతో రీ-ఎంట్రీ ఇవ్వబోతోంది జింటా... సన్నీడియోల్ హీరోగా రూపొందనున్న భయ్యాజీ సూపర్ హిట్‌లో ప్రీతి జింటా హీరోయిన్. యాక్టర్‌గా మారేందుకు ప్రయత్నించే గ్యాంగ్‌స్టర్ స్టోరీనే ఈ భయ్యాజీ సూపర్‌హిట్.. ఇందులో ప్రీతి సన్నీడియోల్ భార్యగా కన్పించనుంది.



కె.సురేష్ బాబు




19 ఫిబ్రవరి 2017

## మంచి ముత్యాలు

ఎవడు మహాబలశాలి అయినప్పటికీ
కోమల హృదయం కలిగి ఉంటాడో
అతడే నిజమైన మానవుడు, ధీరుడు.
-స్వామి వివేకానంద

## విషయ విశేషం






## భావ వీచిక



### ప్రాణాంతక కాలుష్యం..

ఇటీవల బోస్టన్‌లో విడుదల చేసిన 'స్టేట్ ఆఫ్ గ్లోబల్ ఎయిర్ 2017' నివేదిక ప్రకారం 2015లో ఓజోన్ కాలుష్యం కారణంగా ఊపిరితిత్తుల వ్యాధులు ముదిరి ప్రపంచవ్యాప్తంగా 2.54 లక్షల మరణాలు సంభవించాయి. ఐతే ఓజోన్ కాలుష్యం కారణంగా సంభవిస్తోన్న అకాల మరణాల్లో భారత్ అగ్రస్థానంలో ఉంది. బంగ్లాదేశ్ కంటే 13 రెట్లు, పాకిస్థాన్ కంటే 21 రెట్లు ఎక్కువగా భారత్‌లోనే ఈరకం మరణాలు సంభవించాయి. ప్రపంచ జనాభాలో 92శాతం అనారోగ్యకర వాతావరణంలోనే నివసిస్తున్నారు. అందులో అభివృద్ధిచెందుతున్న దేశమైన ఇండియాలో అనారోగ్యకర వాతావరణం లోనే అనేకులు నివసించటం తెలిసిన విషయమే.

పై నివేదికను 'ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హెల్త్ మెట్రిక్స్ అండ్ ఇవాల్యుయేషన్ (యూనివర్సిటీ ఆఫ్ వాషింగ్టన్), యూనివర్సిటీ ఆఫ్ బ్రిటిష్ కొలంబియా సహకారంతో రూపొందించారు. ఇందులో 2,000మంది పరిశోధకులు పనిచేశారు. 1990 తర్వాత కాలంలో 195 దేశాలలో 300కు పైగా వ్యాధులకు సంబంధించి వ్యాధిగ్రస్తుల ప్రవర్తనారీతులు, తీసుకునే ఆహారం, పర్యావరణ పరిస్థితులను వారు పరిశీలించారు.

ఇండియాలో ఓజోన్ కాలుష్యం కారణంగా అనేకమంది అకాల మరణాలు, వ్యాధిగ్రస్తులు కావడం ప్రస్తావించు కున్నప్పుడు ఇది ఆరోగ్యానికి సంబంధించి అత్యవసర పరిస్థితిగా గుర్తించి, నివారణపై దృష్టి నిలపవలసి ఉంది. అంటే ఓజోన్ కాలుష్య నివారణకు తక్షణం చర్యలు చేపట్టాలి. దేశవ్యాప్తంగా కాలుష్య రహిత గాలికోసం అవసరమైన అన్నిరకాల చర్యలూ తీసుకోవాలి.

అయితే ఇదేదో కేవలం ప్రభుత్వమే చక్కదిద్దే పనికాదు. పౌరులందరూ ఎవరికి వారు అవగాహనతో కాలుష్య నియంత్రణ దిశగా తమ చేతలను సరిదిద్దుకోవలసి ఉంటుంది. అప్పుడే క్రమంగా ఓజోన్ కాలుష్యం అదుపులోకి వచ్చేది, ఈ కారణంగా సంభవించే అకాల మరణాలు నిలిచేది. కాలుష్య నియంత్రణ ప్రతిపౌరుడి బాధ్యత!

## లేఖలు

### సమకాలీన సమస్య...

ఫిబ్రవరి 5 వార్త ఆదివారం అనుబంధంలో ప్రచురించిన కవర్ స్టోరీ 'గట్టెక్కని గండం- మన రైలు ప్రయాణం' భారత్‌లోని రైల్వేల పరిస్థితికి దర్పణం పట్టింది. తరచు జరిగే రైలు ప్రమాదాలు ప్రజలకు ప్రయాణాలంటేనే భయం పుట్టిస్తున్నాయి. చేరేవరకు గ్యారంటీలేని రైలు ప్రయాణాలు మనవి. రైల్వేలను ఆధునీకరించి, ప్రమాదాలకు అడ్డుకట్ట వేయాల్సిన అవసరం ఎంతైనా ఉంది. సమకాలీన సమస్యపై..అందునా బడ్జెట్ సమయంలో చక్కని కవర్‌స్టోరీ అందించటం ముదావహం. మీకు మా కృతజ్ఞతలు. -కె.ప్రవీణ్, హైదరాబాద్; పి.పావని, కడప.

### వాస్తవాలకు ప్రతీక 'మూడోకన్ను'

ఫిబ్రవరి 5 వార్త ఆదివారం అనుబంధంలోమూడోకన్నులో 'అసలు 'పద్మా'లు వారు'ఎంతో బాగుంది. ప్రముఖ గాయకులు, ఆధ్యాత్మికవేత్తలు, సమాజసేవకులు, ప్రతిభావంతులు..మొదలైనవారికి పద్మ అవార్డులు ప్రకటించటం నిజంగా మనమంతా గర్వించదగ్గ విషయమే. అయితే అర్హులకు అందకుంటే బాధాకరమే. భావవీచిక చదివి సమాజంలో తొలగని మూఢత్వం దృష్టిముందు నిలిచి బాధపడ్డాం. ఈవారం కవిత్వంలో 'జగన్నాటకం' కవితలో భ్రమ, సత్యం రెంటికీ జీవి ఎలా సర్దుకుపోతాడో తెలియజెప్పారు. మీకు మా అభినందనలు. -పక్కి రాధాగోపాలకృష్ణ, విశాఖపట్నం.

### ..అనుబంధం అలరించింది

ఫిబ్రవరి 5 వార్త ఆదివారం అనుబంధంలో 'సంఘీ'భావం'లో పోషకాహార విధానంలోని నూతన ఆవిష్కరణలను గురించి బాగా వివరించారు.నాథ్ కార్టూన్లు విషయపరంగా నవ్యత ఉన్నా, రేఖ ఇంకా మెరుగుపరుచుకోవలసి ఉంది. వాస్తులో కంక వేధ గురించి తెలుసుకోగలిగాం. నేటి సినిమారంగ స్థితిగతుల గురించి చిత్రభారతిలో చక్కగా చెప్పారు. 'ప్రేమపరీక్ష' కథచిన్నదైనా బాగుంది. ప్రేమకథామాలిక..'నీలిపుష్పం' మాకెంతో నచ్చింది. -డా.శివభూషణం, కర్నూలు.

### సంచిక నచ్చింది

ఫిబ్రవరి 5 వార్త ఆదివారం అనుబంధంలో 'భావవీచికలో భక్తివేరు, మూఢభక్తి వేరని చక్కగా చెప్పారు. న్యూట్రిషన్‌యాప్, ఫుడ్‌యాప్ కోసం కేంద్రప్రభుత్వం పూనుకొంటోందని సంఘీభావం తెలిపింది. లతామాధవీయం' కథ ఇంపుగా సాగింది. రచయితకు అభినందనలు. అంటార్కిటికా ఘనతరంగ దృశ్యం మనోహరంగా ఉంది. నీలిపుష్ప' హృద్యంగా ఉంది. -నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖ; ఆర్.లత, విజయవాడ; డి.ప్రసాద్, తిరుపతి.

'సంఘీ'భావం

# సాధికారత చేతల్లో చూపాలి!



మహిళా సాధికారతే లక్ష్యంగా విజయవాడలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం జాతీయ మహిళా పార్లమెంటు సదస్సును నిర్వహించడం అభినందించదగిన విషయమే. కానీ పార్లమెంటులోనే మహిళా ప్రాతినిధ్యం 11.6 శాతానికి మించకపోవడమే బాధాకరం. దేశంలో 48 శాతానికి పైగా మహిళా జనాభా ఉన్నా వారికి లోక్‌సభలో, రాజ్యసభలో ప్రాతినిధ్యం మాత్రం నామమాత్రంగానే ఉండడానికి కారణమేమిటో పురుషాధిక్య సమాజం ఆలోచించాలి. అన్నిటికి మించి విజయవాడ వేదికగా జరిగిన మహిళా సదస్సులో, మహిళలకు చట్టసభల్లో ప్రతిపాదించిన 33 శాతం రిజర్వేషన్ల బిల్లు సంగతేమిటని మహిళా ప్రతినిధులు ప్రశ్నించారు. ఈ ప్రతిపాదన రెండు దశాబ్దాలుగా బిల్లు కాకుండా చర్చల్లోనే నలుగుతున్నది. స్థానిక సంస్థల్లో ఇప్పటికే 33 శాతం రిజర్వేషన్లు అమలై 13 లక్షల మంది మహిళా ప్రజా ప్రతినిధులు పాలన సాగిస్తున్నారు. కానీ ఎమ్.ఎల్.ఏ, ఎం.పి.ల విషయానికి వస్తే రిజర్వేషన్ల బిల్లు మాత్రం ముందుకు సాగడంలేదు. ఎప్పుడు ఈ బిల్లు గురించి చర్చకు వచ్చినా ఏదో ఒక పార్టీ ఏదో ఒక కారణం చూపి అడ్డుకుంటున్నది. అందుకే ఈ ముగింపు సమావేశానికి హాజరైన లోక్‌సభ స్పీకర్ సుమిత్రా మహాజన్ మాట్లాడుతూ– "మహిళా రిజర్వేషన్లకోసం మనం పోరాడాల్సిన అవసరం లేదు. వాళ్లే గౌరవంగా రిజర్వేషన్లు ఇవ్వాలి. ఈ విషయమై చట్టసభల్లో జరుగుతున్న రాద్ధాంతం ఆగిపోవాలి. అడ్డుకునేవారు ఇప్పటికైనా పశ్చాత్తాపంతో రిజర్వేషన్ల బిల్లుకు మోకాలడ్డడం మానుకోవాలి" అంటూ ఆమె సుతిమెత్తగా మహిళా రిజర్వేషన్లను వ్యతిరేకించేవారిని హెచ్చరించారు.

ఇక కేంద్రమంత్రి వెంకయ్యనాయుడు మాట్లాడుతూ– "మహిళా రిజర్వేషన్ల బిల్లుకు ఆమోదం ఇవ్వడం మా బాధ్యత. అయితే తమకు చట్టసభల్లో మెజార్టీ లేదు. మెజార్టీ వస్తే తప్పక మహిళల బిల్లే తమ తొలి ఎజెండా" అంటూ ఆయన సమాధానం ఇచ్చారు. మొత్తంగా మహిళల పార్లమెంటుకోసం నిర్వహించిన సదస్సులో మహిళా బిల్లుతో పాటు మహిళలు దైనందిన జీవితంలో ఎదుర్కొంటున్న అనేక రూపాల అణచివేత గురించి దానిపై పాలకుల ఉదాసీనత గురించి చర్చ జరిగింది. అయితే మహిళలకు సమానత్వం ఇచ్చే విషయంలో వారికి గౌరవం ఇచ్చే విషయంలో ఇప్పటికీ పాలకులే కాకుండా పురుషుల్లో కూడా ద్వంద్వ వైఖరి కనిపిస్తున్నది.

మహిళలకు సాధికారత ఇచ్చే విషయంలో అంతా మాటలకే పరిమితమవుతున్నారు. చేతల విషయంలోకి వచ్చేసరికి వెనక్కి వెళ్లిపోతున్నారు. ఫిబ్రవరి 13న జాతీయ మహిళా దినోత్సవాన్ని కూడా జరుపుకున్నాం. కానీ మహిళల లింగ సమానత్వం, వేతన సమానత్వం, కుటుంబంలో సమాన గౌరవం, పనిలో సమాన హక్కులు అనేవి ఇప్పటికీ ఎండమావిగానే మారాయి. మహిళలను అణచివేయడంలో కులాలవారిగా, మతాలవారిగా, ప్రాంతాలవారిగా వ్యత్యాసాలు ఉన్నాయి. ఎలా ఉన్నా అవి మహిళలను రెండో పౌరులుగానే చూస్తున్నాయి. కుటుంబంలోగానీ, సమాజంలోగానీ ఎక్కడైనా మహిళల హక్కులు మృగ్యమైపోయాయి. అమ్మాయిగా ఉన్నప్పుడు తండ్రిపై, యువతిగా మారిప్పుడు భర్తపై జీవితాంతం ఆధారపడాల్సిన పరిస్థితే ఇప్పటికీ కనిపిస్తున్నది. బాలికల విద్య విషయంలోనూ వారిని స్వేచ్ఛగా బయటికి పంపి పని చేయించడంలోనూ వివక్ష రాజ్యమేలుతున్నది. ఆర్థిక సర్వేనే ఉదాహరణగా తీసుకుంటే మహిళల్లో అక్షరాస్యత 55 శాతాన్ని మించడం లేదు. మాతా శిశు మరణాలు గ్రామాల్లో 1000కి 41 ఉంటే; పట్టణాల్లో 25దాకా ఉన్నాయి. రక్తహీనత సమస్యను కూడా యువతులు, మహిళలు అధిగమించలేకపోతున్నారంటే పరిస్థితి ఎంత దారుణంగా ఉందో అర్థం చేసుకోవచ్చు.

దేశంలో లోక్‌సభ, రాజ్యసభల్లో మొత్తం సభ్యులు 787 మంది ఉంటే అందులో 91 మందే మహిళలు. అంటే వారి శాతం కేవలం 11.6 మాత్రమే. మహిళా ఎం.పి.ల విషయంలో మనం 145వ స్థానంలో ఉన్నాం. మనకంటే పొరుగున ఉన్న చైనాలో మహిళా ఎంపిల శాతం 24 ఉండగా, బంగ్లాదేశ్‌లో 20 శాతం, పాకిస్థాన్‌లో 19.5 శాతం, నేపాల్‌లో 29.6 శాతం, ఆఫ్ఘనిస్తాన్‌లో 27 శాతందాకా ఉంది. అయినా మన పురుషాహంకార రాజకీయ వ్యవస్థలో ఈ విషయమై మార్పు కనిపించడం లేదు. చివరకు మనం పాకిస్థాన్‌కన్నా దిగువన ఉండడం సిగ్గుచేటని చెప్పుకోక తప్పదు. చిన్న దేశమైన రువాండాలో మహిళా ప్రాతినిధ్య శాతం 64గా ఉంటే బొలీవియాలో 54 శాతం ఉందని తెలిసిన తరువాత కూడా మన దగ్గర మహిళా బిల్లును అడ్డగిస్తున్నారంటే పురుషాధిక్యత ఎంతగా జడలు విప్పి నృత్యం చేస్తుందో అర్థం చేసుకోవచ్చు. స్థానిక సంస్థల్లో రిజర్వేషన్ల తరువాత అక్కడ పరిపాలన సజావుగా ఉందని స్వచ్ఛత, పరిశుభ్రత ఆదాయాలు మెరుగయ్యాయి పలు నివేదికలు తేల్చి చెప్పిన తరువాత కూడా ఎం.పి.లు, ఎం.ఎల్.ఏ.లుగా రిజర్వేషన్లు ఇవ్వాలంటే మనం వెనుకంజ వేయడం, అడ్డుపుల్లలు వేయడం అత్యంత శోచనీయమైన విషయమని చెప్పక తప్పదు.

సోషల్ మీడియా యుగంలో కూడా మహిళలపై వివక్ష కొనసాగుతూనే ఉన్నది. మహిళలకు సాధికారత రావాలంటే అది ముందుగా ఇంటినుంచి ప్రారంభం కావాలి. ఇంట్లోనే సోదరుణ్ణించి, తండ్రినుంచి గౌరవం దక్కాలి. అబ్బాయితోపాటు అమ్మాయికి అవకాశాల్లో, హక్కుల్లో సమానత్వం ప్రకటించాలి. ఎక్కడా చిన్నచూపు చూడకూడదు. అప్పుడే దిగువ స్థాయినుంచి మహిళలకు సాధికారత దిశగా మార్పు ప్రారంభం అవుతుంది. అది చివరకు సాధికారత దిశగా ముందుకు వెళుతుంది. అయితే ఇదంతా ఉత్తర కుమార ప్రగల్భాల్లా కాకుండా చేతల్లో చూపించినప్పుడే సాధికారత లక్ష్యం నెరవేరుతుంది. మహిళల కల సాకారం అవుతుంది.

మహిళలకు ఇంట్లో, బయటా పనిలో అవకాశం ఇస్తే దేశ స్థూల ఉత్పత్తి 3 లక్షల కోట్లకు పెరుగుతుందని మెకెన్సీ నివేదిక ఎప్పుడో సాధికారికంగా చాటిచెప్పినా వారికి ఉపాధి, ఉద్యోగం ఇచ్చే విషయంలో మొండి చేయే కనిపిస్తున్నది. అమ్మాయి 18 ఏళ్ల వయస్సు దాటిందంటే ఆమెను అత్తింటికి పంపే విషయం గురించే ఆలోచిస్తున్నారు తప్ప వారిని దేశ ఉత్పత్తిలో భాగస్వామిని చేయాలనే ఆలోచన ఎవరిలో కలగడం లేదు. దీనివల్లే మహిళా ఉపాధి ప్రతి ఏడాది పెరగడానికి బదులు తగ్గుతూ 22 శాతానికి పడిపోయింది. ఇది పెరగాలంటే తల్లిదండ్రులతో పాటు సమాజ వైఖరిలో విప్లవాత్మక మార్పు రావాలి. ఇది క్షేత్ర స్థాయినుంచి ఉన్నత స్థాయిదాకా జరిగితే తప్ప మహిళా సదస్సులకు కూడా సార్థకత ఉండదు.

– డాక్టర్ గిరీష్‌కుమార్ సంఘీ




– ఎ.వి.వి. ప్రసాద్

# అతడు.. ఓ రాజకీయ వింత!

**అమెరికన్లలో ఎన్నో 'ఆశ'లు పెంచుతూ జనవరి 20న అధికారం చేపట్టిన ట్రంప్ నెల రోజులుగా నిత్యం వార్తల్లోకి వస్తూనే ఉన్నారు. అవి మామూలు వార్తలు కావు. హెడ్డింగ్‌లు చదివి పక్క వార్తల్లోకి వెళ్లేవి కావు. 'తాజాగా ట్రంప్ ఏం ప్రకటించాడు' అని పాఠకులు వెదకి వెదకి చూసే వార్తలవి. ఆమూలాగ్రం చదివింపచేసే వార్తలవి. రోజూ సంచలనాలే. ఆయన ఏది మాట్లాడితే అదే ఓ సంచలన వార్త అవుతోంది. ఆయన ఎటు కదిలినా అది రకరకాల కేరికేచర్లకు ఆసరా అవుతోంది. ఒక దేశ అధ్యక్షుడు వరుసగా నెల రోజులు మీడియా పతాక శీర్షికల్లో 'వార్తల్లో వ్యక్తి'గా మిగిలాడంటే అది బహుశా ట్రంప్ ఒక్కడేనేమో! అనిపిస్తుంది. ఈ విషయంలో మాత్రం ఆయన ఒబామాకంటె ఓ మెట్టు కాదు.. నాలుగైదు మెట్లపైననే ఉన్నట్లే కనిపిస్తుంది. వృద్ధులు, మహిళలుసైతం అధిక సంఖ్యలో రోడ్లపైకి వచ్చి నిరసన ప్రదర్శనలు జరుపుతున్నా తొణకని, బెణకని అధ్యక్షుడు కూడా బహుశా ఆయనేనేమో! అనుకోవాలి...**

**ట్రంపు పేరు తలచ ధైర్యము చేజారు**
**కెవ్వు కేకపెట్టు గ్రీను కార్డు,**
**జావగారుచుండె శరణార్థి బతుకులు**
**విశ్వవినుత నామ! వినురవేమ!!**

మొండివాడు రాజుకంటె బలవంతుడంటారు. కానీ ఆ మొండివాడే రాజయితే! ఎంతవాడవుతాడు! బహుశా ట్రంపంతటి వాడవుతాడేమో! నెల రోజులుగా తనదైన బాటలో, ముళ్ల గుచ్చుకొంటున్నా లెక్కజేయకుండా నిర్నిరోధంగా సాగిపోతున్న అమెరికా అధ్యక్షుడు డొనాల్డ్ ట్రంప్‌ను చూసి ప్రస్తుతం ప్రపంచ మంతా అటువంటి వ్యాఖ్యలే చేస్తోంది. ఆయన గొప్పవాడే. ప్రపంచంలోని అత్యంత సంపన్నులైన కొద్ది మందిలో ఆయనా ఒకడే. ఒక గొప్ప ఆర్థిక సామ్రాజ్యాన్ని స్థాపించుకొని ఆ సింహాసనంపై మహారాజులా వెలిగిపోతున్నవాడే. డాలర్లొకటే కాదు, చేతినిండా 'పవర్' కావాలనుకొని బరిలోకి దిగాడు, మొత్తానికి అమెరికా వంటి 'పవర్‌ఫుల్' కంట్రీకి అధ్యక్షుడయ్యాడనిపించుకొన్నాడు. రాజకీయంగా ఎలాంటి పూర్వానుభవం లేకపోయినా, ప్రత్యర్థి హిల్లరీకి గట్టి పోటీ ఇవ్వడమేగాక అనూహ్యంగా ఆమెను పక్కకు నెట్టి 'వైట్ హౌస్'లోకి ప్రవేశించాడు. అంతవరకు బాగానే ఉంది. అతి తక్కువ 'ప్రజాదరణ రేటింగ్'తో అందలం ఎక్కినా 'పోనీలే, మనవాడే కదా' అని అమెరికన్లంతా తమాయించుకొన్నారు. అయితే ఎవరైతే 'పోనీ ఒక ఛాన్సిచ్చి చూద్దాం' అనుకొన్నారో వారే ఇవాళ 'ఇంకా నాలుగేళ్లు భరించాలా' అనే స్థితికి వచ్చినట్లు కనిపిస్తున్నారు. గడచినవి నెల రోజులే. ఇంకా 47 నెలలు గడవాలా? అనుకొంటూ అసహనాన్ని వ్యక్తం చేస్తున్నారు. నెల రోజుల్లోనే ఇంత గందర గోళాన్ని, ఇంత అశాంతిని సృష్టిస్తే ఆయన్ని ఇలాగే వదిలేస్తే మిగిలిన కాలంలో ఇంకెంత అసాధారణ పరిస్థితిని సృష్టిస్తాడోనని వారంతా బెంబేలెత్తుతున్నారు.



దేశంలో పెల్లుబుకుతున్న నిరసనలను సైతం లెక్కజేయకుండా ప్రపంచంలో పెరుగుతున్న వ్యతిరేకతను పట్టించుకొనకుండా యధేచ్ఛగా ఆయన నరుక్కుంటూ పోతున్నాడు. 'ఉన్న చెట్లని నరికితేనే కదా! కొత్త మొక్కలు వేయగలం' అనే ధోరణిలో ఆయన ముందుకు సాగిపోతున్నాడు. 'నేనందరివైపు చూస్తాను.. కానీ నా వైపు ఎవరూ చూడొద్దు' అనిపించే తరహాలో ఆయన కదిలిపోతున్నాడు. ఇది ఆయనకు బాగానే ఉండొచ్చు. కానీ ఇంతకాలం అమెరికా వైపే చూస్తున్న ప్రంచ దేశాలకు అదెలా నచ్చుతుంది? అందుకే ఆ దేశాలన్నీ వణికిపోతున్నాయి. ఆయన ఏ రోజు ఎలాంటి ఫర్మానా జారీ చేస్తాడోనని గుండెలరచేతిలో పట్టుకొని గుబులు గుబులుగా దుఃఖాన్ని దిగమింగుతున్నాయి. అయినా ఆయన 'నా ఇచ్ఛయే గాక! నాకేటి వెరపు' తరహాలో దూసుకుపోతున్నాడు.

అధికారంలోకి రాగానే తొలుత ఆయన కన్ను పడింది ఒబామా అంతవరకు అమలు చేసిన పథకాల పైనే. ఎనిమిదేళ్లు అధికారంలో ఉన్న అధ్యక్షుడుగా ఒబామా ప్రపంచంలో కొంత మంచి పేరునే సంపాదించుకొన్నాడనిపిస్తుంది. ముఖ్యంగా విదేశీ సంబంధాలలో అమెరికా స్థానాన్ని మరో రెండు మెట్లుపైకి ఎక్కించాడనే చెప్పాలి. దేశీయంగానూ ఎన్నో ప్రజారంజక పథకాలను అమలు చేసి అధ్యక్ష పదవినుంచి వైదొలగే సమయానికి కూడా తన ప్రజాదరణ రేటింగ్‌ను 40 శాతానికి తగ్గకుండా నిలబెట్టుకొన్నాడంటే ఆయన పాలనా దక్షతకు అదే పెద్ద నిదర్శనంగా కనిపిస్తుంది. ఒబామా ఎనిమిదేళ్ల క్రితం అధికారంలోకి వచ్చే సమయానికి ఆయన ప్రజాదరణ రేటింగ్ అంతకుముందు ఉన్న అందరి అధ్యక్షులకంటె చాలా ఎక్కువగా 86 శాతంవరకు ఉండగా, అత్యల్పరేటింగ్ 36శాతంతో ట్రంప్ అధికారం లోకి వచ్చారు. మరి అంతటి ప్రజాదరణ గల అధ్యక్షుని పథకాలను అతితక్కువ ప్రజాదరణగల అధ్యక్షుడు ఒక్క దెబ్బతో నరికేస్తే ఎలా? అధికారం ఉన్నది కదా అని చేతిలోని కొరడాను ప్రజలు మెచ్చుకొన్న పథకాలపై సైతం ఝుళిపిస్తే ఎలా? కానీ ట్రంప్ అదే పని చేశాడు. ఓవల్ ఆఫీసులోకి ప్రవేశించిన మొదటి 24 గంటల్లోనే ఒబామా హెల్త్ కేర్‌పై తన కత్తిని దింపి దాని అమలుపై కోతలు పెట్టాడు. అంటే అది ఆ తర్వాత సహజ మరణం పొందడా నికి చర్యలు తీసుకొన్నాడన్నమాట. దేశంలోని అల్పాదాయ వర్గాలకు తక్కువ ప్రీమియంతో ప్రాణావసరమైన వైద్య చికిత్సల నందించే 'హెల్త్‌కేర్' పథకాన్ని ఒబామా తన 'డ్రీమ్ ప్రాజెక్ట్'గా రూపొందించి, ఎన్నో సమస్యలను ఎదుర్కొంటూ అమలు చేశారు.

అయితే ఆ 'ఒబామా కేర్'ను నిలుపుదల చేసే కార్యనిర్వాహక ఉత్తర్వులపై తొలి సంతకం చేసి తన విధ్వంసక బాటలో తొలి అడుగు వేశారు ట్రంప్. అది మొదలు అప్రతిహతంగా, నిర్నిరోధంగా ఆయన తన 'నరికివేత'లను కొనసాగిస్తూ సాగిపోతూనే ఉన్నారు. ఒక్క సంతకంతో కొన్ని కోట్ల మంది అమెరికా పౌరుల ఆరోగ్య బీమా ను అటకెక్కించిన ట్రంప్ తర్వాత..ముస్లిం దేశాలపైన, హెచ్-1బి వీసాలతో అమెరికాలో ఉద్యోగాలు చేసుకొంటున్న ప్రవాసులపైన తన ప్రతాపాన్ని చూపించారు. గత నెలరోజులుగా రోజుకో కార్య నిర్వాహక ఉత్తర్వుతో ప్రపంచం గుండెల్లో దడ పుట్టిస్తూనే ఉన్నారు. శరణార్థులను, వలస వచ్చిన వారిని వదలకుండా పరుగులు పెట్టిస్తూనే ఉన్నారు. అసలే అట్టుడుకుతున్న సిరియాపై, అక్కడి శరణార్థులపై వాతలు పెట్టే విధంగా పునరావాస కార్యక్రమాలపై కోతలు విధిస్తూ పశ్చిమాసియా లో సరికొత్త అలజడికి కారణమయ్యారు. ఏడు ఇస్లామిక్ దేశాల పౌరులకు మూడు నెలలపాటు వీసాల జారీని నిలిపివేస్తూ 'ఇలాంటి అధ్యక్షుడిని ఇప్పటిదాకా చూడలేదు' అనిపించుకొన్నారు. భయంతో కొందరు, బాధతో కొందరు తప్పించుకు తిరుగుతున్నా వారిని జుట్టు పట్టుకొని ఆపి మరీ చెంప ఛెళ్లుమనిపిస్తున్నారు. న్యాయవ్యవస్థపైనా కన్నెర్రచేసి తనను వ్యతిరేకించే అటార్నీ జనరల్స్‌పై చర్యలకు సిద్ధ మవుతున్నారు. కొన్నికోర్టులు ట్రంప్ ఉత్తర్వులను తొక్కిపెడుతున్నా

వాటిపై ఆయన తాడెత్తున లేచి 'చూస్తా.. కొత్త చట్టాలు చేస్తా' నంటూ హెచ్చరిస్తున్నారు. అందుకే అమెరికా మిత్ర దేశాలు సైతం ట్రంప్‌ను చూసి అంతగా భయపడిపోతున్నాయి. ట్రంప్ తమ దేశంలోకి రాకూడదనే ప్రజలనిరసనలతో ఆ దేశాలు హోరెత్తిపోతున్నాయి.

*********

అమెరికన్లలో ఎన్నో 'ఆశ'లు పెంచుతూ జనవరి 20న అధికారం చేపట్టిన ట్రంప్ నెల రోజులుగా నిత్యం వార్తల్లోకి వస్తూనే ఉన్నారు. అవి మామూలు వార్తలు కావు. హెడ్డింగ్‌లు చదివి పక్క వార్తల్లోకి వెళ్లేవి కావు. 'తాజాగా ట్రంప్ ఏం ప్రకటించాడు' అని పాఠకులు వెదకి వెదకి చూసే వార్తలవి. ఆమూలాగ్రం చదివింపచేసే వార్తలవి. రోజూ సంచలనాలే. ఆయన ఏది మాట్లాడితే అదే ఓ సంచలన వార్త అవుతోంది. ఆయన ఎటు కదిలినా అది రకరకాల కేరికేచర్లకు ఆసరా అవుతోంది. ఒక దేశ అధ్యక్షుడు వరుసగా నెల రోజులు మీడియా పతాక శీర్షికల్లో 'వార్తల్లో వ్యక్తి'గా మిగిలాడంటే అది బహుశా ట్రంప్ ఒక్కడేనేమో! అనిపిస్తుంది. ఈ విషయంలో మాత్రం ఆయన ఒబామాకంటె ఓ మెట్టు కాదు... నాలుగైదు మెట్లపైనే ఉన్నట్లే కనిపిస్తుంది. వృద్ధులు, మహిళలు సైతం అధిక సంఖ్యలో రోడ్లపైకి వచ్చి నిరసన ప్రదర్శనలు జరుపుతున్నా తొణకని, బెణకని అధ్యక్షుడు కూడా బహుశా ఆయనేనేమో! అనుకోవాలి. మరొకరైతే ఆ వ్యతిరేకతను తట్టుకోలేక 'ఈ పదవి నాకొద్దు' అని వదిలేసి వెళ్లిపోయి ఉండేవారు. కానీ 'పవరు' మాయ సాధారణంకాదు. ఎదుటివారినో, ప్రత్యర్థులనో తన ఆగ్రహాగ్నిలో మసి చేయాలనుకొని, తన అనాలోచిత చర్యలతో చివరికి వారికే ఆయన మేలు చేస్తున్నాడేమో! అని కూడా అనిపిస్తుంది. 'ట్రాన్స్-పసిఫిక్ భాగస్వామ్య ఒప్పందం' రద్దు చేయడం అటువంటిదే. ఒబామా హయాంలో కుదిరిన ఈ కీలక ఒప్పందం వల్ల ఎన్నో దేశాలకు లబ్ధి చేకూరడంతోపాటు అమెరికా కూడా అధిక ప్రయోజనమే పొందుతోంది. అయితే ఒబామా పథకాలన్నిటిని తొలుత తుంగలో తొక్కాలనే దురుసు వైఖరితో ఎంతో ప్రయోజనం కలిగించే పథకాలు, ఒప్పందాలను కూడా ఆయన తుడిచిపారేస్తున్నారేమో! అనిపిస్తుంది.

అమెరికాతోపాటు జపాన్, మలేసియా, వియత్నాం, సింగపూర్, బ్రూనై, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, కెనడా, మెక్సికో, చిలీ, పెరు వంటి 12 దేశాలు పరస్పరం కుదుర్చుకొన్న ఈ 'ట్రాన్స్-పసిఫిక్ భాగస్వామ్య ఒప్పందం' (టిపిపి) ఎన్నో ఏళ్ల చర్చోపచర్చల తర్వాత గత సంవత్సరం నుండి అమలులోకి వచ్చింది. సభ్య దేశాల మధ్య ఆర్థిక సంబంధాలు బలోపేతం చేయడం, సుంకాలు తగ్గించడం, పరస్పర అభివృద్ధికారక చర్యలు తీసుకోవడం వంటి లక్ష్యాలతో పన్నెండు దేశాలు సమష్టిగా ఈ ఒప్పందం కుదుర్చుకొన్నాయి. ఆసియా-పసిఫిక్ ప్రాంతంలో చైనా ప్రాబల్యాన్ని కట్టడి చేయడానికి, దక్షిణ చైనా సముద్రంలో విస్తరిస్తూ వెళ్తున్న 'డ్రాగన్'ను నిరోధించడానికి ఉపకరించే విధంగా ఈ 'టిపిపి'ని రూపొందించారు. దాని వెనుక గల ప్రయోజనాలను ట్రంప్ ఎంత పరిశీలించారో, లేదో తెలియదు గాని ఆ ఒప్పందం నుంచి అమెరికా వైదొలగుతున్నట్లు ప్రకటించారు. ట్రంప్ ఎన్నికల ప్రచారంలో కూడా టిపిపిని ప్రయోగించారుగాని 'ఆయన గెలిచినప్పుడు కదా!' అని చాలా మంది పట్టించుకోలేదు. కానీ ఆయన గెలిచివచ్చి దానికి బ్రేక్ వేసేసరికి మిగిలిన సభ్య దేశాలన్ని ఇప్పుడు గుండెలు బాదుకొంటున్నాయి. ఒకపక్క చైనాతో ఢీకొనడానికి సిద్ధమవుతూ, మరోవక్క టిపిపి నుంచి అమెరికా ఉపసంహారణ జరపడం ఏవిధంగా సముచితమవుతుందని అందుకే పలు దేశాలు ప్రశ్నిస్తున్నాయి. ఆ ఒప్పందం నుంచి అమెరికా వైదొలగడంవల్ల చైనాకు బాగా కలిసివస్తుందనే నిపుణులు చెబుతున్నారు. 'ప్రాంతీయ సమగ్ర ఆర్థిక భాగస్వామ్యం' వంటి సొంత వాణిజ్య కూటమి (ఆర్‌సిఇపి)ని ఏర్పాటు చేసుకొని అమెరికాకు దీటుగా నిలబడ దానికి చైనా ప్రయత్నిస్తున్న దశలో టిపిపి నుంచి వైదొలగితే దాని వల్ల అమెరికాకంటె చైనాకే ఎక్కువ ప్రయోజనం కలుగుతుందని నిపుణులు భావిస్తున్నారు. ట్రంప్ అధ్యక్షుడు కాగానే చాలా దేశాల 'దౌత్య విధానా'ల్లో మార్పులు వస్తున్నాయి. సింగపూర్, ఫిలిప్పీన్స్, మలేసియా, చైనా ప్రతిపాదించిన 'ఆర్‌సిఇపి' పట్ల మొగ్గు చూపడం కొత్త సమీకరణలకు బాటలు వేస్తోంది. మరిన్ని దేశాలు ఆ బాటను అనుసరిస్తే అంతర్జాతీయంగా అమెరికా బలహీనపడి క్రమంగా అగ్రరాజ్య హోదాను కూడా కోల్పోయే ప్రమాదంలో పడుతుంది. మరి ఈ విషయాలు ట్రంప్‌కు తెలియనివని అనుకోగలమా! టిపిపి నుంచి అమెరికా బయటకు రావడంవల్ల చైనా ప్రాబల్యం పెరగడంతోపాటు అమెరికా ఆర్థికవృద్ధి తగ్గుతుందనీ, దేశీయంగా ఉపాధి కల్పన క్షీణిస్తున్నదనీ వాషింగ్టన్‌లోని 'కౌన్సిల్ ఆన్ ఫారెన్ రిలేషన్స్' విశ్లేషకుడు రిచర్డ్ హాస్ పేర్కొన్న విషయం చూస్తే ట్రంప్ చర్యలు ఎంత తొందరపాటుగా ఉన్నవో అర్థమవుతుంది. ఎన్నికల ప్రచారంలో 'అవసరం' కొద్దీ ఎన్ని అనవసర మాటలు ఆడినా, అధికారంలోకి వచ్చిన తర్వాతనైనా ఆలోచించకుండా ఉంటారా! అనే ఎవరైనా అనుకొంటారు. కానీ ట్రంప్ తన విధానం అది కాదన్నట్లుగా మెక్సికో సరిహద్దుల్లో దుర్భేధ్యమైన గోడ నిర్మాణానికి ఉత్తర్వులు జారీ చేసేశారు. మెక్సికన్ల రాకను, వలసలను నిరోధించడానికి సరిహద్దుల్లో గోడ కట్టాలని ప్రతిపాదించిన ట్రంప్ ఆ గోడ నిర్మాణ వ్యయాన్ని మెక్సికో భరించాలంటూ తొలుత ఆదేశాలు జారీచేశారు. ఆ గోడ మాకు అవసరం లేదు. మేమెందుకు భరిస్తాం' అంటూ మెక్సికో తిరగబడేసరికి- 'అయితే నిర్మాణ వ్యయం అమెరికాయే భరించి గోడ కడుతుం'దని ప్రకటించారు. నిజానికి అమెరికన్లపై ఇదొక అనవసర భారమే. అమెరికా, మెక్సికో నడుమ 3,100 కి.మీ. సరిహద్దు ఉండగా దానిలో కంచె ఉన్న ప్రాంతం మినహా మిగిలిన భూభాగంలో సరిహద్దు గోడ నిర్మించాలన్నది ట్రంప్ సంకల్పం. అంటే దాదాపు 1600 కి.మీ. మేర ఈ గోడ నిర్మించడానికి చర్యలు మొదలయ్యాయి. దానిపట్ల అమెరికాలోనేగాక మెక్సికోలో, దానికి మద్దతు నిచ్చే మరికొన్ని దేశాల్లో కూడా తీవ్ర వ్యతిరేకత వ్యక్తమవుతోంది.

హెచ్-1బి వీసా నిబంధనలు కఠినతరం చేసే ప్రయత్నాలతోపాటు గ్రీన్‌కార్డుల జారీపై కూడా ఆంక్షలు విధించడానికి ట్రంప్ తీసుకొన్న తాజా నిర్ణయంపట్ల చివరికి అమెరికా మిత్రదేశాలు కూడా తీవ్రంగా విభేదిస్తున్నాయి. అమెరికాలో శాశ్వత నివాసం ఏర్పరచుకొనడానికి ఎన్నో ఏళ్లుగా ఎదురుచూస్తున్న ప్రవాసుల ఆశలపై నీళ్లు చల్లుతూ- వచ్చే పదేళ్లలో గ్రీన్ కార్డుల సంఖ్యను సగానికి తగ్గించాలనే ప్రతిపాదనతో కూడిన బిల్లును అమెరికా సెనెట్‌లో ప్రవేశపెట్టడం కూడా జరిగిపోయింది. ఎంతో కష్టపడి చదువుకొని ఉన్నత ఉద్యోగాలపై కాంక్షతో అమెరికా వచ్చిన ప్రపంచంలోని ప్రవాసులందరి మెడలపై ట్రంప్ వేసిన కత్తిని చూస్తుంటే ఇక ఆయన ఎవరిని వదిలిపెడతారనే సందేహం కలుగుతుంది. ఈ తాజా బిల్లును పరిశీలిస్తే, సాధారణంగా ఓ భారతీయునికి పదేళ్లలో రావలసిన గ్రీన్ కార్డు 35 యేండ్లకు గాని రాని పరిస్థితి నెలకొంటుందనే విషయం అర్థమవుతుంది. గ్రీన్‌కార్డు ఎంపికకు అమలు చేస్తున్న బహుముఖ వీసా లాటరీ విధానం కూడా రద్దు చేయాలని సెనెటర్లు ప్రతిపాదించారంటే ప్రవాసులపై ట్రంప్ మద్దతుదారులు ఎలాంటి బ్రహ్మాస్త్రాలను ప్రయోగించదలిచారో స్పష్టమవుతుంది. ఈ చర్యలన్నిటివల్ల నిజానికి అమెరికాకు కలిగేలాభంకంటె నష్టమే ఎక్కువ. సిలికాన్‌వాలీలోని ప్రపంచప్రఖ్యాత ఐటి కంపెనీలన్నీ ట్రంప్ చర్యలను పూర్తిగా వ్యతిరేకిస్తున్నాయి. దేశ ఆర్థిక వృద్ధికోసం ఇంతకాలం తాము తపిస్తుంటే, ఇవాళ ట్రంప్ వచ్చి దేశాన్ని వందేళ్ల వెనుకకు నెట్టివేస్తున్నాడని ఆ కంపెనీలు ఆరోపిస్తున్నాయి. ట్రంప్ తీసుకొంటున్నచర్యలు అమెరికా ప్రతిష్ఠను ఎంతగా దిగజార్చుతున్నాయో చెప్పడానికి మరో ఉదాహరణ ఇజ్రాయెల్ ఇటీవల చేసిన సెటిలర్ల చట్టానికి మద్దతుపలకడం. పశ్చిమాసియాలో ఉద్రిక్తతలు తగ్గించడానికి ఇంతకాలం ప్రయత్నాలు జరుగుతుండగా, వాటిని ఎగదోసేచర్యలకు ట్రంప్ ఉపక్రమిస్తున్నారనిపిస్తుంది. ఇవన్నీ అమెరికా తిరోగమనానికి దారితీసేటటువంటివే. మొదటి నెలలోనే ట్రంప్ ఇంతగా ప్రపంచాన్ని కంగారుపెడితే.. తదుపరి నెలల్లో ఇంకెంత భయాందోళనలకు గురిచేస్తారో మరి! చూడాలి.



# 'వాత' విధీ.. కరి మొర వినరేరా..?



కవర్ స్టోరీ

పెట్ల వెంకటేశం

భాగవతంలోని గజేంద్రమోక్షం కథలో గజేంద్రుడు నీటిని తాగడానికి సరోవరానికి వెళ్లి మకరికి చిక్కి, పట్టు విడిపించుకోలేక, చివరకు శ్రీహరికి మొర పెట్టుకుంటాడు. శ్రీహరి, గజేంద్రుని మొర విని ఉన్నపాటున వచ్చేసి, రక్షిస్తాడు. కానీ నేడు వాస్తవంలోనే అనేకానేక వన్యప్రాణులు మనిషి స్వార్థానికి బలవుతున్నాయి. వన్యప్రాణుల చర్మం కోసం, దంతాలకోసం, కొమ్ముల కోసం.. మనిషి, వాటిని రకరకాల హింసలకు గురిచేసి, ఉచ్చులు బిగించి, ప్రాణాలు తీసి, అక్రమరవాణాచేసి సొమ్ముచేసుకుంటున్నాడు. ఈ దారుణం నానాటికీ తీవ్రమవుతూ వన్యప్రాణుల ఉనికిని నామమాత్రం చేయటం ఆందోళనకు గురిచేసే అంశంగా మారింది. ఆనాడు మకరిపట్టు నుంచి గజేంద్రుని, శ్రీహరి కాపాడాడేమో కానీ నేడు అసంఖ్యాక వన్యప్రాణులను మనిషి నుంచి కాపాడేవారే కరువయ్యారు. వన్యప్రాణుల రక్షణకు చట్టాలున్నా అవి కాగితాలకే పరిమితమయ్యాయి. మూగజీవాలపై హింస అప్రతిహతంగా కొనసాగుతూనే ఉంది. పర్యావరణ క్షేమానికి జీవవైవిధ్యం ఎంతో అవసరమని ఎంతగా ప్రచారం జరుగుతున్నా స్వార్థపరులు తమ దుర్మార్గాన్ని వీడటంలేదు. ప్రపంచ వ్యాప్తంగా వన్యప్రాణులను, ముఖ్యంగా ఏనుగులను మట్టుబెడుతున్న వైనం, వాటి జనాభా తగ్గిపోతున్న తీరు, అక్రమ రవాణా దందా..వీటిని అరికట్టడానికి తీసుకుంటున్న చర్యలు మొదలైన వివరాలతో సమగ్ర కథనం ఈవారం మీకోసం..



ప్రపంచంలో డ్రగ్స్ అక్రమవ్యాపారం కొన్ని వేల కోట్ల రూపాయలు ఆర్జించి పెడుతోంది. ఆయుధాల అక్రమరవాణా, యువతుల అక్రమరవాణా ..ఈ వ్యాపారాలన్నీ వేల, కోట్లు గుమ్మరిస్తున్నాయి. వన్యప్రాణులను వేటాడి వాటి చర్మాలను, కొమ్ములను, దంతాలను, ఎముకలను అక్రమంగా రవాణా చేస్తే కొన్ని లక్షల కోట్లు వచ్చిపడుతున్నాయి. వన్యప్రాణుల్లో ఏనుగులు, ఖడ్గమృగాలు, పులులు అక్రమ వ్యాపారానికి అపారమైన లాభాలను తెచ్చిపెట్టే వనరులుగా వాణిజ్య మూలాలకు జీవం పోస్తున్నాయి. ఒక కిలో గ్రాము ఏనుగుదంతం లభిస్తే చాలు కొన్ని వేలు జేబులోకి వచ్చి చేరినట్టే. అలాగే ఖడ్గమృగం నొసటిపై ఉన్న కొమ్ము కిలో కొన్ని వేలకు అమ్ముడు పోతోంది. ఇక పులి చర్మం, పులి గోళ్లకు మార్కెట్లో ఎంత డిమాండ్ ఉందో తెలిసిందే. ఈ అక్రమ వ్యాపారాలు దేశ సరిహద్దులు దాటి ప్రపంచ దేశాల మార్కెట్‌ను పెంచి పోషిస్తున్నాయి. 2015లో 24 వేల ఏనుగులు అక్రమ వ్యాపారుల గొడ్డళ్లకు బలయ్యాయి. ఈ సంఖ్య భారతదేశంలోని మొత్తం ఏనుగుల సంఖ్యతో సమానం. అదే విధంగా అదే సంవత్సరం 1342 ఖడ్గమృగాలు ఖతం అయ్యాయి. 2010లో కిలోగ్రాము ఏనుగు దంతం విలువ 750 డాలర్లు ఉండగా నాలుగేళ్లలో 2100 డాలర్లకు అమాంతంగా పెరిగింది. ఖడ్గమృగం కొమ్ము విలువ కిలో 29 వేల రూపాయల వరకు పలుకుతోంది. ఇదే రేటు ప్రపంచమార్కెట్‌లో ఇలాగే కొనసాగితే 20 ఏళ్లలో ఆఫ్రికా ఏనుగుజాతి చిరునామా లేకుండా పోతుంది. ఇదేవిధంగా ఖడ్గమృగం అంతరించి పోక తప్పదు. ప్రపంచమార్కెట్ ఫలితంగా వన్యప్రాణులు అంతరించిపోతుండడంపై 183 దేశాలు ఆవేదన వ్యక్తంచేస్తూ ప్రమాద పరిస్థితి నుంచి సంరక్షించుకోవాలన్న తపనతో ఒప్పందం కుదుర్చుకొన్నా ఈ అక్రమవ్యాపారం మాత్రం అడ్డూ అదుపూ లేకుండా యధాతథంగా కొనసాగుతోంది. దీన్ని అరికట్టవలసిన దశలో మరోవైపు ఆఫ్రికా, ఆసియాల మధ్య సిండికేట్లు తయారై డిమాండ్‌కు తగ్గట్టు వీటిని సరఫరా చేస్తూండడం గమనార్హం.

సిండికేట్లు ఏనుగు దంతాలను, ఖడ్గమగం కొమ్ములను ఆఫ్రికానుంచి కంటైనర్ల ద్వారా ఆసియాలోని గమ్యస్థానాలకు చేరుస్తున్నాయి. మలేసియా, సింగపూర్ దేశాల్లోని ఓడరేవులు ముఖ్య రవాణా కేంద్రాలుగా వర్ధిల్లుతున్నాయి. హేగ్ ఆధారంగా పనిచేస్తున్న వైల్డ్ లైఫ్ జస్టిస్ కమిషన్ (డబ్ల్యుజెసి) వియత్నాంలోని ఉత్తరభాగంలో ఎవరికీ అంతగా తెలియని 'నిహిఖె' అనే మారుమూల పట్టణం ఈ అక్రమ వాణిజ్యానికి ఆయువుపట్టుగా ఉందని కనుగొనగలిగింది. సోషల్ మీడియా వెబ్‌సైట్లను సిండికేట్లు తమ వాణిజ్య ప్రచారానికి అనువుగా వినియోగించుకొంటున్నారు. బహిరంగంగా స్మగ్లింగ్ వస్తువులను అమ్మచూపుతున్నారు. బ్యాంకు లావాదేవీలు, అకౌంట్ నంబర్లుకూడా సోషల్ మీడియాలో బహిరంగమవుతున్నాయి. డబ్ల్యుజెసి దర్యాప్తులో ఒక్క ఏడాదిలోనే వియత్నాంలో 53.1 మిలియన్ డాలర్ల వ్యాపారం సాగింది. ఖడ్గమృగం కొమ్ములు, ఏనుగు దంతాలు, పులి అవయవాలు, చర్మాలు, గోళ్లు భారీగా అమ్ముడయ్యాయి. ఖడ్గమృగం కొమ్ములే ఈ స్మగ్లింగ్ వ్యాపారంలో

సింహభాగం ఆక్రమిస్తున్నాయి. 42 మిలియన్ డాలర్లవరకు ఈ కొమ్ముల వాణిజ్యం సాగింది. సంప్రదాయ వైద్యరంగంలో మందుల తయారీకి ఖడ్గమృగం కొమ్ములను విరివిగా వాడుతుంటారు. గాజులు, కఫ్స్ కూడా కొమ్ములతో చేస్తున్నారు. వీటిని ధరించడం ఆయా కుటుంబాల హోదా కింద పరిగణిస్తుంటారు.

అక్రమ వన్యమృగ వాణిజ్యానికి అడ్డుకట్ట వేయాలన్న లక్ష్యంతో హనోయి సదస్సులో అంతర్జాతీయ సమాజం ఈ స్మగ్లింగ్ వాణిజ్యాన్ని నిరోధించాలని ప్రపంచదేశాలను కోరింది. నేరగాళ్లకు శిక్ష విధించే న్యాయ విధానాన్ని కఠినంగా అమలుచేయాలని, దక్షిణ ఆఫ్రికా తరఫున వచ్చిన యువ ప్రతినిధులకు సూచించింది. దక్షిణ ఆఫ్రికాలో ఖడ్గమృగాల వేట జోరుగా సాగుతుంది. అంతర్జాతీయ మార్కెట్‌లో ఖడ్గమృగాల కొమ్ములకున్న డిమాండ్ ఎక్కువ. ఈ ప్రతినిధులు వియత్నాం వరకు పర్యటించి ఏనుగులాంటి శాకాహార జంతు సంతతిని నాశనం చేయరాదని అభ్యర్థించింది. ఈ విధంగా మార్కెట్‌లో ఈ వన్యప్రాణి వస్తువులకున్న డిమాండ్ తగ్గించగలిగింది. 1980 లో ఏనుగుదంతాలను భారీగా వినియోగించే దేశంగా జపాన్‌రికార్డుకెక్కింది. ఇప్పుడు వినియోగాన్ని చాలా వరకు తగ్గించేశారు. తరువాత చెప్పుకోదగిన దేశం తైవాన్. ఏనుగుదంతాలు, ఖడ్గమృగాల కొమ్ములు, పులిచర్మాల వాణిజ్యం ఇక్కడ పెద్ద ఎత్తున సాగుతుంది. ఇక్కడ కూడా చాలావరకు తగ్గించేశారు. ఈ అక్రమ వ్యాపారాన్ని నిరోధిస్తామని చైనా ముందుకు వచ్చింది.



1989లో సైటెస్ మొత్తం దంతం వాణిజ్యంపై నిషేధం విధించింది. దాంతో ఏనుగుల జాతి మళ్లీ క్రమంగా జీవించడానికి అవకాశం ఏర్పడింది. కానీ ఆఖరి దశాబ్దంలో ఏనుగుల సంఖ్యను పరిశీలిస్తే విచారం కలుగుతుంది. ఐరోపా మీదుగా జరిగే నౌకా వాణిజ్యం ఈ పరిస్థితిని మరింత క్లిష్టం చేసింది. బ్రిటన్‌లో అప్పటి ప్రభుత్వం దంత వాణిజ్యాన్ని పూర్తిగా నిషేధిస్తామని తన మానిఫెస్టోలో ప్రకటించింది. కానీ వాస్తవంలో ఏమీ జరగలేదు. 19వ శతాబ్దం లో దంత వ్యామోహ ఉన్మాదానికి ప్రత్యక్ష సాక్షిగా ఇంగ్లాండు నిలిచింది. దువ్వెనలు, అద్దాల ఫ్రేములు, పియానో మెట్లు, బిలియర్డ్ బాల్స్ ఒకటేమిటి? ప్రతి వస్తువు దంతంతో తయారుచేసేలా పిచ్చి వ్యామోహం చాటుకుంది ఇంగ్లాండులో ఏనుగుదంతాలపై ఉన్న విపరీతమైన వ్యామోహం ఫలితంగా 1860 నుంచి 1920 వరకు 1.1 మిలియన్ ఏనుగులు హతమయ్యాయి. 1913లో అమెరికా కూడా ఏటా దాదాపు 200 ఏనుగుల దంతాన్ని వినియోగించుకుంది. బ్రిటన్ పూర్తిగా ఏనుగుల దంతాల వినియోగాన్ని నిషేధించడం, అదే దారిలో భారతదేశం పయనించడం ఈ క్లిష్ట పరిస్థితిని అధిగమించడానికి దోహదపడుతోంది. 19వ శతాబ్దం ప్రారంభంలో ఆఫ్రికాలో 26 మిలియన్ ఏనుగు లుండేవి. ఇప్పుడు మిలియన్ కన్నా తక్కువగా ఉన్నాయి. 60 మిలియన్ సంవత్సరాల నుంచి ఏనుగుల జాతి ఉంటోంది. ఈ ఏనుగుల్లో ఎన్నో రకాలు ఉన్నాయి. ఏనుగులు అంతరించిపోతే ఈ భూతలం పెద్ద తరాన్ని కోల్పోయినట్లు కనిపిస్తుంది.

### తగ్గుతున్న పులుల సంఖ్య:



కర్ణాటకలోని నాగర్‌హోల్-బందిపూర్ రిజర్వు ఫారెస్టు 1500 చదరపు కిలోమీటర్ల మేర విస్తరించి ఉంది. నీలగిరి అడవుల్లో అంతర్భాగంగా ఉన్న ఈ ఫారెస్టులో ప్రపంచం మొత్తంమీదే ఎక్కడాలేని విధంగా భారీ ఎత్తున పులుల సంరక్షణను నిర్వహిస్తున్నారు. 2014 నాటి అంచనాల ప్రకారం 570 పులులు ఈ రిజర్వు ఫారెస్టు ఏరియాలో ఉన్నాయి. అయితే నాగర్ హోల్-బందీపూర్ రిజర్వు ఫారెస్ట్ పరిధిలో 221 పులులు సంరక్షింప బడుతున్నాయి. 2010 నుంచి ఇప్పటివరకు 68 పులులు చనిపోయాయి. గత జనవరి నుంచి 7 పులులు చనిపోవడం శోచనీయం. ఈ రిజర్వు ఫారెస్టుకు ఆనుకొని గ్రామాలు ఉన్నాయి. అడవుల్లో ఆహారం దొరకనప్పుడు రిజర్వు ఫారెస్టునుంచి పులులు ఏదో ఒక

## స్మగ్లింగ్ నాయకుడు వీరప్పన్



దాదాపు 6 వేల కిలోమీటర్ల విస్తీర్ణం లోని అటవీ ప్రాంతం తన స్మగ్లింగ్ కోటగా సామ్రాజ్యాన్ని విస్తరింపచేసుకున్న కూసె మునిస్వామి వీరప్పన్ పేరు మోసిన సవాలుగా మారాడు. 200 ఏనుగులను వేటాడి దంతాల స్మగ్లింగ్ సాగించాడు. 2,600, 000 డాలర్ల విలువైన దంతా లను, 22, 000,000 డాలర్ల విలువైన 10 వేల టన్నుల చందనం దుంగలను స్మగ్లింగ్ సాగించాడు. దాదాపు 20 ఏళ్ల పాటు ఎవరికీ దొరకకుండా తన స్మగ్లింగ్ నిరాఘాటంగా సాగించాడు. అతన్ని పట్టుకుంటే 5 కోట్ల నగదు బహుమతి ఇస్తామని ప్రభుత్వాలు ప్రకటించాయి. 2004లో చివరలో పోలీస్ కాల్పులకు గురై మృతి చెందాడు. వీరప్పన్ గ్యాంగ్‌లో వందల మంది సాయుధులైన బలగాలు ఉండేవి. తనకు అడ్డు వచ్చిన 184 మందిని హతం చేశాడు. అతని చేతిలో సీనియర్ పోలీస్ ఆఫీసర్లు, అటవీ శాఖ అధికారులు కూడా ప్రాణాలు కోల్పోయారు. 1990లో కర్ణాటక ప్రభుత్వం స్పెషల్ టాస్క్‌ఫోర్సును ఏర్పాటు చేసింది. తరువాత అతని అనుచరులను కూడా టాస్క్‌ఫోర్స్ మట్టు బెట్టింది. మూడు నెలల తర్వాత వీరప్పన్ చామరాజనగర్ జిల్లాలోని రామాపూర్ పోలీస్ స్టేషన్‌పై దాడి చేసి అనేకమంది పోలీసులను చంపి ఆయుధాలను, మందుగుండు సామగ్రిని లూటీ చేశాడు. 1992లో ఉచ్చు పన్ని ఎస్.పి. హరికృష్ణను, ఎస్‌పి షకీల్ అహ్మద్‌ను, మరో నలుగురిని హతమార్చాడు. 1997 జూలైలో 9 మంది అటవీశాఖ అధికారులను కిడ్నాప్ చేశాడు. తమవారిని విడిచిపెట్టాలని డిమాండ్ చేశాడు. 2000 జూలై 30న ప్రఖ్యాత సినీ నటుడు రాజ్‌కుమార్‌ను కిడ్నాప్ చేశాడు. ఆ తర్వాత 2000 నవంబర్ 15న ఎలాంటి ప్రమాదం లేకుండా రాజ్‌కుమార్ బయట పడ్డాడు.

రాజ్‌కుమార్‌ను విడుదల చేయడానికి 500,000,000 రూపాయలు వీరప్పన్‌కు చెల్లించినట్టు ఆరోపణలు వచ్చాయి. 2004 అక్టోబర్ 18న వీరప్పన్, అతని అనుచరులు ఇద్దరిని తమిళనాడు స్పెషల్ టాస్క్‌ఫోర్సు అరెస్టు చేసి తర్వాత హతమార్చింది.

విధంగా బయటపడి గ్రామాల్లోని పశువుల మందపై దాడిచేస్తుంటాయి. ఈ బాధలు పడలేక గ్రామాల ప్రజలు కొందరు ఈ అడవుల్లో ఎక్కడికక్కడ వలలు, ఉచ్చులు అమర్చి పులుల నుంచి రక్షించుకోడానికి ప్రయత్నిస్తున్నారు. అయితే ఉచ్చుల్లో చిక్కుకుని చనిపోయిన పులులనుంచి చర్మాలను, గోళ్లను సేకరించి అంతర్జాతీయ మార్కెట్‌లో విక్రయించుకోవాలన్న దురాశతో కొందరు కోరి ఉచ్చులు పన్నుతున్నారన్న ఆరోపణలు కూడా వినిపిస్తున్నాయి. బందీపూర్ సరిహద్దు లో ఉన్న హాదునూరు గ్రామానికి చెందిన హెచ్.సి. పుట్టాస్వామి కొన్నేళ్ల క్రితం తన వ్యవసాయంలోని పంటలను కాపాడుకోవడానికి పొలాల వద్ద గస్తీ కాసేవాడు. రోజూ తెల్లవారు జాము 2 గంటలవరకు కాపలా ఉండేవాడు. ఏనుగులు, అడవి పందులు పంటలు పాడుచేస్తుంటాయని ఒకసారి పులిదాడి చేసినప్పుడు సమీపాన స్నేహితులు కేకలు పెట్టడంతో పులి పారిపో యింది. పుట్టాస్వామి తిరిగి కోలుకోడానికి మూడేళ్లలో వివిధ సర్జరీలు చేయించుకో వలసివచ్చింది. గతరెండేళ్లుగా ఈ ప్రాంతానికి పులులు రావడం, దాడిచేయడం పరిపాటి అయింది. 2015 నవంబర్‌లో పశువుల కాపరిపై పులి దాడిచేసింది. 2013 డిసెంబర్‌లో పులుల దాడుల వల్ల వేర్వేరు సంఘటనల్లో అయిదుగురు చనిపోయారు. రిజర్వు ఫారెస్టులకు చేరువగా గ్రామాలుండడంతో పులుల వల్ల గ్రామస్థులు రోజూ ఆందోళనకు గురికావలసి వస్తోంది. అయితే పులులను చంపడానికి ఎవరూ సాహసించడంలేదు. పంటలను పాడుచేస్తున్నాయన్న కోపంతో గ్రామస్థులు డైనమైట్లు, పెల్లెట్ తుపాకీలు ఉపయోగించి వాటిని తరిమి కొడుతున్నారు. పులులు చనిపోవడం తమ కోరిక కాదని, తమ పంటలకు, పశువుల మందలకు రక్షణ కలిగిస్తే చాలని గ్రామాల ప్రజలు చెపుతున్నారు.

వియత్నాంలో ఈ శతాబ్దం ప్రారంభంలో ఆసియా ఏనుగులు 200, 000 వరకు ఉండేవి. 1970 నాటికి 1,50,000 వరకు తగ్గాయి. ఇప్పుడు 36,000 నుంచి 51000 వరకు మాత్రమే మిగిలిఉన్నాయి. ఆఫ్రికా ఏనుగుల సంతతికన్నా ఆసియా ఏనుగుల సంతతి అంతరించిపోయే అంచుల్లో ఉంది. ఆసియా ఏనుగుల సంతతి మొత్తం ఆఫ్రికా ఏనుగుల సంతతిలో పదో వంతు మాత్రమే. ఆసియా ఏనుగుల సంఖ్య ఆసియాలో ఏమాత్రం ఉందన్నది వివరాలు తెలియడం లేదు. కొన్ని దేశాల్లో అయితే ఏనుగులు ఎక్కడ ఉంటాయో చెప్పలేని దుస్థితి ఏర్పడింది. అడవులను నిర్మూలించి ఇళ్లు కట్టుకుని, రోడ్డు నిర్మించుకుని, పొలాలను సాగు చేయడం ఎప్పుడైతే ప్రజలు ప్రారంభించారో



అప్పటి నుంచి ఏనుగుల సంతతికి అడవుల్లో నీడ కరువై జనావాసాలపై చొరబడడం



2009లో మనుషుల స్వార్థానికి బలైన ఏనుగు

ప్రారంభించాయి.

ఏనుగులపై దాడి చేయడం, అలాగే వేటాడి చంపడం వంటి చర్యల ఫలితంగా ఏనుగుల



జాతితోపాటు ప్రజల ప్రాణాలకు కూడా నష్టం కలిగే ప్రమాద పరిస్థితులు ఏర్పడ్డాయి. వేటగాళ్లు ఏనుగులను వేటాడి వాటి దంతాలను, మాంసాన్ని, చర్మాన్ని, వెంట్రుకలను కాజేస్తున్నారు. అందుకే ఆసియా ఏనుగుల సంతతి జీవనం దిన దిన గండంగా మారింది. ఇప్పుడు ఇవి కేవలం 40, 000 మాత్రమే జీవించి ఉన్నట్టు అంచనా వేస్తున్నారు. అలాగే ఆఫ్రికా ఏనుగుల సంతతి 400,000 కన్నా ఎక్కువే ఉండవచ్చని అంచనా వేసినా ఏటా వేటగాళ్ల బారిన పడి 38వేల వరకు నశించి పోతున్నాయి. ప్రస్తుతం ఎదురవుతున్న ప్రధాన సమస్య ఏమిటంటే ఏనుగులు దారి తప్పి సంచరిస్తూ గ్రామాలపై దాడి చేయడం, జనావాసాలను ధ్వంసం చేయడం, పంటలను నాశనం చేయడం. దీంతో జనం వాటిని అడ్డుకోవడానికి చాలాసార్లు తుపాకీ కాల్పులు జరపవలసి వస్తోంది. కొన్నేళ్ల క్రితం అడవుల్లో ఏనుగులు సంచరించే మార్గాలు వేరుగా ఉండేవి. కానీ ఇప్పుడు జాతీయ రహదార్లు, కాలువలు, నగరాల నిర్మాణం వంటివి రావడంతో ఏనుగుల సంచారానికి ఆటంకాలు ఏర్పడ్డాయి. లోయల్లో వాగులు, నదుల ప్రవాహాల వద్ద డ్యామ్ నిర్మాణాలు సాగుతున్నాయి. దంతాల కోసం మగ ఏనుగులను వేటాడడం ఎక్కువయింది.

భారతదేశంలో ఏనుగులను అక్రమంగా నిర్బంధించడం, స్మగ్లింగ్ చేయడం తీరని సమస్యగా ఉంటోంది. 2010 నవంబరులో అసోం ఈశాన్య ప్రాంతంలో ఏనుగుల స్మగ్లింగ్ ముఠాను పోలీసులు పట్టుకోగలి గారు. మూడు ఏనుగులను స్వాధీనం చేసుకుని అయిదుగురిని అరెస్టు చేశారు. నిందితుల వద్ద ఉన్న వివరాలను పరిశీలిస్తే ఈ ముఠా అసోం ఈశాన్య ప్రాంతం నుంచి గత అయిదేళ్లుగా 92 ఏనుగులను స్మగ్లింగ్ చేసి దేశంలోని వివిధ ప్రాంతాలకు చేరవేసి నట్టు వెల్లడయింది. అసోం నుంచి రోజూ స్మగ్లర్లు ఏనుగులను వేటాడి పట్టుకో వడం, ఒకటి రెండేళ్లు వాటికి శిక్షణ ఇవ్వడం, గున్న ఏనుగుల నుంచి మదపు టేనుగుల వరకు అవి పెంపుడు జంతువుల గానే నమ్మిస్తుండడం జరుగుతోంది.

2010 నవంబర్ 1న భారత దేశం చట్టం ప్రకారం ఏనుగుల విక్రయాన్ని నిషేధించారు. రాష్ట్రాల మధ్య కూడా ఏనుగుల రవాణా జరగాలంటే ప్రభుత్వ అనుమతి తప్పనిసరి. అయినప్పటికీ ఏనుగుల క్రయ-విక్రయాలు నిరాఘాటంగా సాగుతున్నాయి. బీహార్, ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని సంపన్నులయిన భూస్వాములు ఏనుగులను కొనుగోలు చేసి తమ అజమాయిషీలో పెంచడం ఒక హోదాగా భావిస్తుంటారు. ఏనుగులు సాధారణంగా ట్రక్కుల ద్వారా రవాణా అవుతుంటాయి. ఈ అక్రమ రవాణాను సులువుగా నిరోధించ వచ్చు. ఐతే అటవీ శాఖ అధికారుల్లో కొందరితో స్మగ్లింగ్ ముఠాలు చేతులు కలిపి చెక్‌పోస్టుల వద్ద ఎలాంటి అడ్డంకులు లేకుండా జాగ్రత్త పడుతుంటారు.

కొన్ని శతాబ్దాలుగా ఏనుగులను వేటాడం, వాటి దంతాలను సేకరించడం జరుగుతోంది. ఆసియా ఏనుగులకన్నా ఆఫ్రికా ఏనుగులకే దంతాలు పెద్దవిగా ఉండటమే కాదు ఎక్కువ దంతాలు వాటినుంచి లభిస్తుంటాయి. ఆఫ్రికా ఏనుగుల్లో మగ, ఆడ ఏనుగుల నుంచి కూడా దంతాలు లభిస్తుంటాయి. అదే ఆసియా ఏనుగుల్లో మగ ఏనుగుల నుంచి తప్ప ఆడ ఏనుగుల నుంచి దంతాలు అంతగా లభించవు. ఆసియా ఏనుగుల విలువ కూడా ఆఫ్రికా ఏనుగులకన్నా ఎక్కువేనని చెబుతుంటారు. కొన్ని కేసుల్లో ఏనుగుల తొండాల నుంచి దంతాలను రంపాలతో కోసి వేరు చేస్తుంటారు. ఏనుగులను చంపివేసిన తరువాత కళేబరాల నుంచి దంతాలను సేకరించడం పెద్ద తంతు. ఈ దంతాలు బెల్జియం, హాంకాంగ్, జపాన్ దేశాలకు ఎక్కువగా వెళ్తుంటాయి. దంతాలతో నగలను, బొమ్మలను, పియానో సంగీత వాయిద్యానికి మెట్లుగా నగిషీలతో తయారు చేసే కార్మికులు ఉన్నారు.

సాధారణంగా ఒక ఏనుగు దంతం కోరతో మూడు బిలియర్డ్ బంతులు తయారవుతుంటాయి. రెండు దంతం కోరలయితే పియానో మెట్ల తయారీకి సరిపోతాయి. జపాన్‌లో సంతకాల సీళ్లు, కండెలను డాక్యుమెంట్లపై అచ్చుగుద్దే స్టాంప్‌లను కూడా దంతాలతో తయారు చేస్తుంటారు. 1980లో జపాన్‌లో ఆర్థిక సంక్షోభం ఫలితంగా దంతాలతో స్టాంప్‌లు, సీళ్ల తయారుచేయడం తగ్గుముఖం పట్టింది. ఆఫ్రికా నుంచి వచ్చే దంత సంపదలో 40 శాతం జపాన్‌కే దాఖలవు తోంది.

అలాగే అమెరికా 15 శాతం, ఐరోపా 20 శాతం ఆఫ్రికా దంతాలనే వినియో గిస్తుంటారు. ఆఫ్రికా ఏనుగుల దంతాలతో తయారు చేసే వస్తువులను, హారాలను ధరిస్తే దుష్టశక్తుల నుంచి రక్షణ కలుగు తుందన్న నమ్మకం ప్రజల్లో బాగా ఉంది. అందుకనే ఆఫ్రికా దంతాలకు అంతర్జాతీయ మార్కెట్‌లో విపరీతమైన డిమాండ్ పలుకుతోంది. దంతాలతో చేసిన చెవి రింగులు, పెండెంట్లు వలయాకార డిజైన్లతో మధ్యలో చుక్క ఉండేలా ధరిస్తుంటారు. ఈ వలయాకార డిజైన్ రింగులు "మంచి కన్ను" అని అభివర్ణిస్తుంటారు. దంతాలొక్కటే కాదు, ఏనుగుతోక, వెంట్రుకలు కూడా బ్రాస్లెట్ల తయారీకి ఉపయోగిస్తుంటారు.

ఐరోపా వలస రాజ్య స్థాపనతో శ్వేత జాతీయుల వేటగాళ్లు ఆఫ్రికా ఖండానికి రావడం ప్రారంభించారు. వారు రాకముందు ఆఫ్రికా ఏనుగుల సంతతి 5 మిలియన్ల నుంచి 10 మిలియన్ల వరకు ఉండేవి. పాత రోజుల్లో ఏనుగుల మంద చుట్టూ అగ్నిగుండం పెట్టి చంపేవారు. అవి దహనం అయిన తరువాత వాటి కళేబరాల నుంచి దంతాల కోరలు సేకరించేవారు. దంత వాణిజ్యం కూడా సామూహిక ఏనుగుల వేట సాగిస్తుండడంతో సగానికి సగం ఏనుగుల సంతతి తగ్గిపోయింది. 1980లో మిగిలిన ఏనుగుల సంతతి 600,000 వరకు



తేలింది. 1989లో నిషేధం రాకముందు దశాబ్ది కాలంలో 1.3 మిలియన్ నుంచి 6,00,000కు సంఖ్య దిగజారింది. అదే కాలంలో కెన్యా దేశంలో 85 శాతం ఏనుగుల సంతతి నశించిపోయింది.

ఉగాండా ఒకానొకప్పుడు 20,000 ఏనుగుల స్థానంగా ఉండేది. 1989 నాటికి కేవలం 1600 ఏనుగులే మిగిలాయి. ఉగాండాలోని కబలెగా నేషనల్ పార్కులో 1966లో 8000 ఏనుగులు ఉండేవి. కెన్యాలో 1970లో వన్యప్రాణుల సంఖ్య 140,000 ఉండగా 1989 నాటికి 16,000కు దిగజారింది. అదే కాలంలో టాంజానియాలో 250,000 నుంచి 61,000కు సంఖ్య దిగజారింది.

1989లో ఆఫ్రికా ఏనుగుల సంతతి క్షీణించింది. దంతాలకోసం చాలా ఏనుగులు వేటకు బలయ్యాయి. ఈ పరిణామాల ఫలితంగా దంతాల సేకరణ క్రయ, విక్రయాలను నిషేధించారు. ప్రపంచ దేశాలన్నిటిలో ఈ నిషేధం అమలయ్యేలా ప్రమాదం అంచుల్లో ఉన్న వన్యప్రాణుల అంతర్జాతీయ వాణిజ్యాన్ని నిరోధించడానికి ఈ మేరకు ఏర్పాటయిన 110 మంది సభ్యులు కల 'సైటెస్' (కన్వెన్షన్ ఆన్ ఇంటర్నేషనల్ ట్రేడ్ ఇన్ ఎండేంజర్డ్ స్పీసీస్) లో 105 మంది నిషేధానికి ఆమోద ముద్ర వేశారు. దీంతోపాటు కఠిన చర్యలను కూడా తీసుకున్నారు.

వీటన్నిటి ఫలితంగా ఆఫ్రికాలో ఏనుగుల సంతతికి రక్షణ కలిగింది. అయితే ఆసియా ఏనుగుల సంతతి విషయంలో మాత్రం తక్కువ ప్రభావం కనిపించింది. దంతాల కోసం డిమాండ్ తగ్గింది. అలాగే దంతాల విలువ కూడా తగ్గింది. ఏనుగులను వేటాడేవారికి అందే నగదు కూడా తగ్గింది. కెన్యాలో ఏనుగుల సంతతి 60 శాతం పెరిగింది. అంటే 1989-93 మధ్య 16000 నుంచి 26000కు ఏనుగుల సంఖ్య పెరిగింది. ఏనుగుల సంతతి సంఖ్య 25000కు స్థిరమైంది. వేటవల్ల చనిపోయే ఏనుగుల సంఖ్య 1989లో 3000 ఉండగా, 1994లో 24కు తగ్గడం విశేషం.

మలవి, జాంబియా, దక్షిణాఫ్రికా, బొత్స్వానా, జింబాబ్వే దేశాల్లో ఏనుగుల మందలు భారీగా ఉంటాయి. వీటిలో మదపుటేనుగులు విధ్వంసానికి పాల్పడతాయని వాటిని వేరు చేస్తుంటారు. అయితే ఈ ఏనుగుల పార్కు రేంజర్లు వేరు చేసిన ఏనుగుల నుంచి సేకరించిన దంతాలను విక్రయించి ధనం ఆర్జిస్తుంటారు. అయితే ఈ ధనాన్ని వన్యప్రాణుల అభివృద్ధి కార్యక్రమాలకే వినియోగిస్తారు. 1997లో 'సైటెస్' సదస్సు జరిగినప్పుడు దంతాలపై ఉన్న నిషేధం పూర్తయింది. ప్రమాదంలో ఉన్న జంతువుల జాబితా నుంచి ఏనుగులను తొలగించారు. 8 సంవత్సరాల నిషేధం తొలగ్గానే బొత్స్వానా, నమీబియా, జింబాబ్వే దేశాలు తమ వద్ద పేరుకుపోయిన దంతాల నిల్వలను, ఏనుగుల మాంసాన్ని, చర్మాలను విక్రయించడం ప్రారంభించారు. కొన్ని ఏనుగులను జూకు తరలించారు. ఒక ఒప్పందం ప్రకారం ఈ దంతాల నిల్వలన్నీ జపాన్‌కు విక్రయించారు. కొత్తగా వేటాడి చంపిన ఏనుగుల నుంచి దంతాలు, చర్మాలు తదితరమైనవి రవాణా కాకుండా జాగ్రత్త పడ్డారు. ప్రపంచం మొత్తంమీద 1996లో దంత సంపద నిల్వలు 500 నుంచి 600 టన్నుల వరకు ఉన్నట్టు తేలింది. ఈ దంతాల నిల్వలు విక్రయించగా వచ్చిన సొమ్మంతా అడవుల్లో జంతువుల సమీపాన నివసించే ప్రజల రక్షణకు, రైతులకు, గ్రామస్థుల నష్టపరిహారం చెల్లింపు లకు కేటాయించేలా చర్యలు తీసుకున్నారు.

ఈ స్మగ్లింగ్‌ను నిరోధించడానికి థాయ్‌లాండ్ అయిదేళ్ల క్రితం తమ దేశంలోని ఏనుగుల సంతతికి మైక్రో చిప్స్‌ను అమర్చే ప్రాజెక్టును చేపట్టారు. దేశంలోని 2350 ఏనుగుల్లో 70 శాతం ఏనుగులకు మైక్రోచిప్స్ సాధనాలు అమర్చగలిగారు. మైక్రోచిప్ ఏనుగులకు లేకపోయినట్లయితే అవి అక్రమ రవాణాకు గురవుతున్నట్టు పసికట్టవచ్చునని నిపుణులు చెబుతున్నారు. ఏమైనా మనిషి తన స్వార్థంకోసం వన్యప్రాణులను మట్టుబెట్టడం తప్పని గుర్తించి, వాటి సంరక్షణకోసం పాటుపడ వలసిన అవసరం ఎంతైనా ఉంది. ■

# మాతృభాష తర్వాతే మరేభాషైనా..

## ఫిబ్రవరి 21 అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం

మాతృభాషను ప్రమాదపు అంచుల్లోకి నెడుతూ యువతరాన్ని భ్రమల్లో ముంచే చర్యలతో కొందరు అధికారులు ముందుకు సాగుతున్నారు. ఇప్పటికే ఆంగ్లమాధ్యమంతో ఉన్నత చదువులు చదివినప్పటికీ ఉద్యోగావకాశాలు లేక సతమతమౌతున్న విద్యార్థులు లక్షల సంఖ్యలో ఉన్నారు. ఉన్నతాధికారుల అంచనా ప్రకారం ఇంగ్లీషులో నైపుణ్యం సాధించినవారంతా ఉద్యోగులై ఉండాలి. కానీ ఆ విధంగా జరగడంలేదుకదా. ఒకవైపు ఇంగ్లీషు ప్రభావంలో ఉన్న స్కాండినేవియా దేశాలలో సైతం, యూరపులోని మరికొన్ని దేశాలు (జర్మనీ, ఫ్రాన్స్) ఆంగ్ల విద్యా మాధ్యమం ప్రభావం నుంచి దూరం కావడానికి, తమ మాతృభాషను పరిరక్షించుకోవడానికి నడుం బిగిస్తున్న తరుణంలో మన ఉన్నతాధికారులు నిమ్మకి నీరెత్తినట్లు మిన్నకుండటం భావ్యంకాదు.

తెలుగు అకాడెమీ బలహీనపడింది. ఆధునిక పరిభాషను నిఘంటువుల రూపంలో తీసుకురాలేకపోవడంతో వివిధ పత్రికలు వాటికి తోచిన పదాల్ని ప్రజల్లోకి తీసుకెళ్తున్నాయి. మన మాతృభాషను, సాహిత్యాన్ని, సంస్కృతిని, కళలను ప్రస్తుత క్షీణదశ నుంచి పురోగమన మార్గంవైపు మళ్లించాలి. ఈ ప్రయత్నానికి అంతర్జాతీయ సంస్కృతి, అంతర్జాతీయ విపణి, అధునాతన విజ్ఞానం వంటి ప్రబల ప్రగతిశీల శక్తులు అవరోధంగా నిలుస్తాయి. వాటిని కాలదన్నుకోకుండా వాటికి తలవంచకుండా ఉంటూ, యుక్తిగా మనం మన భాషనూ, మన సాహిత్యాన్ని, సంస్కృతిని, కళల్ని నిలుపుకోవాలి. మన మాతృభాష అయిన తెలుగు ఇతర ప్రాంతాలకు విస్తరించిందే తప్ప తనదంటూ ఏమీ కోల్పోలేదు. ఇతర భాషల ప్రాబల్యానికి తలవంచనూ లేదు. రెండువేల ఏండ్ల నాటి హాలుని 'గాథా సప్తశతి', ప్రపంచ సాహిత్యంలోనే తొలి సంకలనం గ్రంథం. అది తెలుగువాడి జీవితమేనని, ఇప్పుడు తెలుస్తున్న వాస్తవం. హాలుడు ఎవరు? ఏమా గాథా సప్తశతి కథాకమామిషు? అన్న విషయాలు తెలుసుకొని ఆనందించే తెలుగువాళ్లిప్పుడు ఎందరున్నారు?

తమిళనాడు, కర్ణాటక, కేరళ, మహారాష్ట్రలలో మాతృభాషలకు అధికార భాషలుగా లభిస్తున్న ఆదరణ చూసి కూడా మన పాలకులకు చీమకుట్టినట్లయినా అనిపించడం లేదు. ప్రభుత్వం తెలుగుభాషా పరిరక్షణకు, అభివృద్ధికి ప్రత్యేకంగా ఒక మంత్రిత్వశాఖను ఏర్పాటుచేసి చిత్తశుద్ధితో కృషి చేయాలి.



మాతృభాషలో విద్యా బోధనను ప్రోత్సహించాలి. బిడ్డలమైన మనమే మన మాతృ భాషను నిరాదరిస్తే ఇతరులు మన భాషాభివృద్ధికి కృషిచేస్తారా? ఏది ఏమైనా మనమే మన మాతృభాషని కాపాడుకోవాలి. ఇవాళ విద్యా రంగంలో ఆంగ్లంమీద మోజు పెరగడంతో తెలుగు భాష ఉనికికి ప్రమాదం ఏర్పడింది. ప్రతి యేడూ 70శాతంమంది ఆంగ్లమాధ్యమంలో చేరుతున్నారు. వీళ్లంతా మాతృభాషకు దూరమవుతున్నారు. వాళ్లు పెరిగి పెద్దవారైన తర్వాత వారి పిల్లల్ని తెలుగు మాధ్యమంలో చదివించరు. ఇలా రెండు, మూడు తరాలు గడిచేసరికి ఇంట్లో తెలుగు మాట్లాడే వృద్ధులు పోయి, ఆంగ్ల విద్యార్థులే మిగిలిపోతారు.

పరిపాలనా భాషగా తెలుగు అమలుకోసం కృషిచేస్తున్నామని ప్రభుత్వం చెపుతున్నప్పటికీ, ఐ.ఎ.ఎస్., ఐ.పి.ఎస్. అధికారులు తమ వద్దకు వచ్చే బాధితులతో ఇంగ్లీషులోనే మాట్లాడడం కనిపిస్తుంది. ఉత్తరాదికి చెందిన ఐఎఎస్, ఐపిఎస్ అధికారులు తెలుగులో మాట్లాడేందుకు ప్రయత్నిస్తుంటే మన రాష్ట్రానికి చెందిన అధికారులు మాత్రం ఆంగ్లంలోనే మాట్లాడుతున్న వైచిత్రి మన రాష్ట్రంలో నెలకొంది. ప్రపంచంలో గరిష్ఠంగా ఏభై ఆరు అక్షరాలున్న ఏకైక భాష తెలుగు మాత్రమే కావడం విశేషం. తెలుగులిపిలో వచ్చిన మార్పులను ప్రతి ఒక్కరికి వివరిస్తే భాషాభిమానులకు, భాషా పరిశోధకులకు ఎంతగానో ఉపయోగకరం అవుతుంది. ఆర్య, ద్రవిడ భాషల సమ్మేళనం తెలుగు, ప్రాచీన హోదాకు అవసరమైన అన్ని అర్హతలున్నాయి. తమిళనాడులో కూడా భాషను నిర్బంధం చేశారని అనుకోలేం. వారికి సహజంగానే భాషాభిమానం అధికం. అది మనకీ రావాలి. భాషల పట్ల అనురాగం వైయక్తికం. ఎవరికివారు తమ భాష గౌరవాన్ని కాపాడుకోవాలని భావించాలి. కొన్ని సందర్భాల్లో మాతృభాష తప్పనిసరిగా వినియోగించాలని చట్టం స్పష్టంగా చెప్పింది. అలాంటివి ప్రభుత్వం ఉపయోగించుకోవచ్చు. ఫలానా పథకాల్లో లబ్ధిపొందాలంటే తప్పని సరిగా తెలుగులో దరఖాస్తుచేయాలని షరతు విధించవచ్చు.

మాతృభాషాభిమానం అంటే పరభాషలను ద్వేషించటమనికాదు. తమ మాతృభాషల పట్ల అభిమానంతో, పలురాష్ట్రాల్లో అన్నిరకాల బోర్డులను, సూచికలను ఆయా స్థానిక భాషల్లోనే రాయటం జరుగుతోంది. ఈ రాష్ట్రాల్లో మరోభాషలో ప్రశ్నించినా సమాధానం స్వభాషలోనే ఇస్తున్నారు. ఇది భాషా దురభిమానమేకాదు, వాస్తవాలను గ్రహించలేని గుడ్డితనం కూడా అవుతుంది.

మాతృభాష అమలు విషయంలో జపాన్, జర్మనీ, ఇటలీ, స్విట్జర్లాండ్ వంటి దేశాల్లో మాదిరిగా మనం కూడా ప్రతి ఒక్కరికీ ప్రాథమిక స్థాయి విద్య మొత్తం మాతృభాషలోనే జరగాలన్న నియమాన్ని ఏర్పాటు చేసుకోవడమేకాదు, ఖచ్చితంగా అమలు జరిగేటట్టు చర్యలు కూడా తీసుకోవాలి.

ప్రాచీన భాష, కృతక ప్రామాణిక భాష, ఆధునిక భాష, మాండలిక భాష, అనే నాలుగు రూపాల్లో మొదటి రెండు రూపాలు. ఇప్పుడు గ్రంథాలయాల్లో మాత్రమే మూలుగుతున్నాయి. చివరి రెండూ ఒక వెలుగు వెలుగుతున్నాయి. అందులో ఆధునిక ప్రామాణిక భాష సైతం అంతగా గుర్తింపు నోచుకోవడంలేదు. ఎక్కువమంది తమకు తెలీని భాషను వాడుకలోకి తేవడమే అందుకు ప్రధానకారణం. తమకు తెలిసిన మాటలతోనే ఎవరైనా తమకు కావలసిన పనులను చక్కదిద్దుకోవాలి.

భాష అంటే ఉద్వేగం ఒకటేకాదు. దాని వెనుక భౌతిక ఆకాంక్షలు అనేకం. మాతృభాషకై ఆందోళన వ్యక్తం చేస్తున్న మనమే పిల్లల అక్షరాభ్యాసం ఆంగ్లంలో జరగాలని పరితపిస్తుంటాం. అన్నింటా తెలుగు వాడాలనుకుంటున్నా అందుకుతగ్గట్లు పదకోశాన్ని, వ్యావహారికాన్ని నిర్మించుకోలేక పోతున్నాం. గూగుల్ సెర్చింజన్ కూడా తెలుగులోనే పేజీలు అందిస్తోంది.

ఒక భాషకు లిపి, గొప్ప సాహిత్యం దానిదంటూ ఒక సంస్కృతి, నాగరికత లేకపోతే అది అంతరించిపోతుంది. వీటి విషయంలో తెలుగు ఎప్పుడూ ముందంజలోనే ఉంది. కానీ ఈమధ్య తెలుగుభాష రానురాను వన్నె తేరవలసిన స్థితే కనిపిస్తుంది. కానీ చిన్నబోవలసిన ముప్పు ఏమీ అంతగా కనపడదు. కానీ ఇప్పుడు మన మాతృభాష మరీ చిన్నబోతుంది. ఈ విషయంలో ప్రతీ మాతృభాషాభిమానులు తమ వంతు కృషిచేయాల్సివస్తుంది.

-ఎస్.ఆర్.భల్లం

# కృతి

## సమకాలీన సమస్యకు పరిష్కారం..



నేటి భారతదేశాన్ని వేధిస్తున్న పెద్ద సమస్య 'వయోవృద్ధులు' చిన్న కుటుంబాలు, విదేశాల్లో ఉద్యోగాలు.. ఈ సమస్యను మరింత జటిలంచేశాయి. సమాజపరంగా కన్నకూతుర్ని ఎలాగూ పరాయి ఇంటికి పంపకతప్పదు. ఉద్యోగార్థం కొడుకు విదేశాల్లో, మరో ప్రాంతంలోనో ఉండాల్సివస్తే, ఆ సంతానాన్నికన్న తలిదండ్రులు, పిల్లలుండీకూడా ఒంటరి జీవితం గడపాల్సిన పరిస్థితి. స్వప్రయోజనాల్ని కొంచెం పక్కకుపెట్టి, సమాజానికి సాయపడుదాం అన్న చిత్తశుద్ధి ఉంటే, ఈ సమస్యను అధిగమించవచ్చునని చెబుతుంది పోలంరాజు శారద రచించిన 'స్వర్ణకుటీరం' నవల. రచయిత్రి సీనియర్ సిటిజన్. దేశాన్నీ, మారుతున్న జీవన విధానాన్ని గమనించారు. ఎగువ మధ్యతరగతి మనుషుల్ని, వారి ఆలోచనల్ని పరిశీలించారు. ఈ సమస్యను అధిగమించటానికి తన వంతు సాయం చేయాలనుకొని స్వర్ణకుటీరాన్ని రూపొందించారు. అమెరికాలో స్థిరపడ్డ రాజేశ్వరరావు దంపతులు, బాల్యస్నేహితుడు కృష్ణమూర్తి, వివిధ మనస్తత్వాలుగల మహతి, మంజరి, సుభద్రమ్మ, విశ్వనాథం, కాంతమ్మ, కాంతారావు, వేదవతి, అఖిలేశ్వరరావు అనే లంకేశ్వరుడు.. వీరందరినీ మనం చూస్తుంటాం. అయితే కనక మహాలక్ష్మి లాంటి వారు నడుంబిగించి కాస్త నిస్వార్థంగా ఆలోచిస్తే ఓల్డ్ ఏజ్ గోల్డ్ ఏజ్ అవుతుందని సందేశం ఇచ్చారు.

**(స్వర్ణకుటీరం -నవల: పోలంరాజు శారద; వెల: 120; ప్రతులకు: అన్ని ప్రధాన పుస్తక కేంద్రాలు)**

-కూర చిదంబరం

## ఆసాంతం ఆసక్తికరంగా..



వివాహబంధం పెళుసుగా తయారైన కాలమిది. ప్రేమ వివాహాలే అయినా కూడా భార్యాభర్తల మధ్య నిరంతరం ఘర్షణ చోటుచేసుకుంటోంది. ఇందుకు కారణం వారు పెరిగిన తీరు, పెరిగిన వాతావరణం.. ఈ నేపథ్యంలో సీనియర్ రచయిత్రి గంటి భానుమతి భార్యాభర్తల బంధాల మధ్య తమ రెండవ నవలగా 'ఆమె గెలిచిందా? ఓడిందా?' పేరిట ఓ నవలిక వెలువరించారు. కథ విషయానికి వస్తే..పద్మజ, తన కూతురు నర్మదను అల్లారుముద్దుగా పెంచింది. రాకేష్‌ను ప్రేమించానంటే కూతురి కోరికను మన్నించింది. కానీ నర్మద అత్తింట అందరితో కలవదు. అహంకారంతో ప్రవర్తిస్తుంది. నర్మద ధోరణి చూసి, పద్మజ తన పెంపకంలో లోపమేననుకుంటుంది. నర్మద పట్టుబట్టి వేరుకాపురం పెట్టిస్తుంది. అయినా ఆనందంగా ఉండలేకపోతుంది. నర్మద, రాకేష్‌ల మధ్య రానురాను దూరం పెరుగుతుంటుంది. తల్లి మంచి చెప్పినా నర్మద వినేస్థితిలో ఉండదు. మొండిగా తయారైన నర్మదను ఎలా దారికి తేవాలో పద్మజకు అర్థంకాదు. చివరకు తల్లిని ఇల్లు అమ్మేయమని, వచ్చే డబ్బుతో రెండు ఫ్లాట్లు కొనుక్కుంటే సమస్య పరిష్కారం అవుతుందని అంటుంది. ఆమె ముందే నర్మద, రాకేష్ గొడవపడతారు. పరిస్థితి పతాకస్థాయికి చేరుకుంటుంది. చివరకు నర్మద తల్లి కాబోతోందన్న విశేషంతో వాతావరణం చల్లబడుతుంది. అన్ని పాత్రల్ని శక్తిమంతంగా తీర్చిదిద్దిన ఈ నవలిక పాఠకుడిని ఆపకుండా చదివిస్తుంది.

**(ఆమె గెలిచిందా? ఓడిందా?: గంటి భానుమతి;వెల: రూ.100; ప్రతులకు: ప్రముఖ పుస్తక విక్రేతలు)**

-జె.శ్యామల

## తెలంగాణ కోటలకు అక్షర చిత్రం



ప్రస్తుతానికి గతమే పునాది. అందువల్ల గత చరిత్ర పట్ల అవగాహన అవసరం ఎంతైనా ఉంది. ఈ కారణంగా చారిత్రక కట్టడాలను సంరక్షించుకోవటం, నాటి చరిత్రను విస్మరించకుండా అక్షరబద్ధం చేయడం తప్పకచేయవలసిన పనులు. తెలంగాణలో అనేకానేక గొప్పకోటలెన్నో ఉన్నాయి. వాటి గురించి అందరికీ అవగాహన కలిగించాలన్న ఉద్దేశంతో నాగబాల సురేష్‌కుమార్ 'తెలంగాణ కోటలు' పేరిట ఓ మంచి పుస్తకాన్ని వెలువరించారు. ఇందులో ఎలగందుల కోటనుంచి ప్రతాపగిరి కోట వరకు పాతిక కోటల గురించిన సమాచారాన్ని పొందుపరిచారు. కాకతీయుల కాలం నుంచి, నిజాం చివరి నవాబుల కాలం వరకూ ఎన్నో రాచరిక సామంతరాజ్య వ్యవస్థల కేంద్రబిందువుగా నిలిచిన కోట ఎలగందుల కోటగురించి అనేక విశేషాలు తెలిపారు. కరీంనగర్ పట్టణానికి ఆగ్నేయంగా కేశవపట్నం మండలంలోని మొలంగూర్ గ్రామంలో శత్రు దుర్భేద్యంగా ఓ కోటను నిర్మించింది వొరగిరి మొగ్గరాజు. ఆ కోట గురించిన సమాచారం చక్కగా తెలియజేశారు.గొలుసుల దర్వాజ గల నిర్మల్ కోట గురించి అనేక ఆసక్తికర విశేషాలు వెల్లడించారు. నల్గొండలో తలెత్తుకునిఠీవిగా నిలిచిన భువనగిరి కోటను కళ్లకు కట్టిన తీరు బాగుంది. కాకతీయుల ఘనచరిత్రకు తార్కాణంగా నిలిచిన వరంగల్ కోట గురించిన ఎన్నో విశేషాలను విశదీకరించారు. ఆసక్తిదాయకమైన ఈ పుస్తకం అందరూ చదవదగ్గది.

**(తెలంగాణకోటలు:నాగబాల సురేష్‌కుమార్; వెల:రూ.150; ప్రతులకు: అన్ని ప్రధాన పుస్తకకేంద్రాలు)**

-ప్రభాస

## అనువాదాలైనా తెలుగు కథల్లాగే..



అనువాద ప్రక్రియపై అభిరుచి గల కొల్లూరి సోమ శంకర్ తెలుగునుంచి ఆంగ్లంలోకి, హిందీలోకి అనువాదాలు చేస్తుంటారు. వీరు అందించిన 'నాన్నా త్వరగా వచ్చేయ్!..'లో 15 కథ లున్నాయి. అమృత వర్షిణి, బేరం, వాళ్లిద్దరూ, ఆటో డ్రైవరు, అనగనగా, నాన్నా తొందరగా వచ్చేయ్! అమ్రికా వాలా, ఇజంలో ఇంప్రిజన్, శిథిలం, ప్లాస్టిక్ హృదయం, ఆపరేషన్ బిర్యానీ, బుద్ధిమాంద్యం, వృక్షప్రేమికుడు, భయంనీడ, నల్లధనం..వగైరా కథలున్నాయి. ఎన్నుకున్న కథలన్నీ సన్నిహితమైన జనజీవన ప్రమాణాల సూచికలు. రాజారాం బాలాజీ ఆంగ్లంలో రాసిన కథను 'గృహగోధికా ప్రహసనం' కథను హాస్యభరితంగా రాశారు. మంజుల అనే గృహిణి తలపై బల్లి పడడం, ఆమె కంగారు..పెద్దలకు ఫోనుచేసి దోష నివారణలు కనుక్కోవడం, ఆ తర్వాత ఆఫీసుకెళ్లడం, ఫెంగ్‌షుయ్‌లో అదృష్టం ఉందనడం.. ఆఫీసులో ఇంక్రిమెంట్ రావడం.. బల్లి దోషంపై ఆలోచన.. మధ్యతరగతి కుటుంబాల ఆందోళన..అదృష్టాలు.. ఆనందం తెలియజేసే చక్కటికథ. అలాగే ఎనిమిదేళ్ల అమిత్ సాయంత్రం ఇంటికిరాని తండ్రికోసం పడే మనోవేదన, ట్రాఫిక్ జామ్ వల్ల లేటుగా ఇల్లుచేరిన నాన్న.. నాన్న పక్కనే నిద్రపోవడం, తండ్రి స్పర్శ అమిత్‌కి ధైర్యాన్ని, భరోసాని ఇవ్వడం... ఆంగ్ల మూలం పుండరిక్ ధూరి. కథలన్నీ తెలుగుకథల్లాగే అనిపిస్తాయి.

**(నాన్నా!! తొందరగా వచ్చేయ్- అనువాద కథా సంకలనం: కొల్లూరి సోమ శంకర్; వెల:రూ.80; ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు)**

-తంగిరాల చక్రవర్తి




# తల వంచని ప్రేమ!

కస్తూరి మురళీకృష్ణ

'నేను నిన్ను ప్రేమించాను. ఎందుకు అంటే ఏమీ చెప్పలేను. ఏం ప్రేమించావు అని అడిగితే చెప్పలేను. ఎలా ప్రేమించావు అని అడిగినా చెప్పలేను. అసలు ప్రేమ అంటే ఏమటి? అని అడిగినా చెప్పలేను. కానీ ఒకటి మాత్రం చెప్పగలను. నీతోటే జీవితం గడపాలని ఉంది. నీతో ప్రతిక్షణం గడపాలని ఉంది. ప్రతిక్షణం నిన్ను చూస్తూ నీ ఆలోచనలలో గడపాలని ఉంది. ఇది తప్పించి ఇంకేమీ స్పష్టంగా పదాలలో చెప్పలేను' యుహ్వా కళ్లల్లోకి సూటిగా చూస్తూ చెప్పాడు కీమ్వా.

యుహ్వా మౌనంగా ఉండిపోయింది.

ఆమె మనస్సులో మాటలలో వ్యక్తపరచలేని పలు విభిన్నమైన భావాలు చెలరేగుతున్నాయి.

ఆమెకు ఏమనాలో తోచలేదు.

ఇది మొదటిసారి కాదు ఓ వ్యక్తి 'ప్రేమిస్తున్నాన'ని చెప్పటం!

కానీ ఈ భావన ఆమెకు అర్థం కావటంలేదు.

ఆమె కళ్లల్లో సంశయాన్ని, సందిగ్దాన్ని చూశాడు కీమ్వా.

ఆమెకెందుకంత అపనమ్మకమో అతడికి అర్థంకావటంలేదు.

'నేను నా జీవితంలో ఎన్నడూ ఇలాంటి భావనను అనుభవించలేదు. నన్ను నమ్ము' ప్రాధేయమపడ్డాడు కీమ్వా.

ఆమెలో సందిగ్ధం మరింత తీవ్రమైంది.

ఇదీ కొత్తకాదు...

ఇలా ప్రాధేయపడటం..చివరికి ఆగ్రహించి బెదిరించటం..ఆపై దౌర్జన్యానికి దిగటం..

ఇదేనా ప్రేమంటే?

ఇతడు కూడా అలాగే చేస్తాడా?

ముందు బతిమిలాడతారు. ఆపై దౌర్జన్యం చేస్తారు.

ఆమె మనస్సులోని సందిగ్ధాలు అతనికి అర్థంకావటం లేదు. ఎందుకంటే, ఆమె అనుభవాలు అతడికి తెలియవు.

'నేనీ పుయో ప్రాంతానికి  రాజును. నేను ప్రజల అభిమానాన్ని చూరగొన్న రాజును. నేను అన్నమాట నెరవేరుస్తానని నా ప్రజల ప్రగాఢ విశ్వాసం. నన్ను విశ్వసించని వారు లేరు. నాపై ఏమిటి నీకీ అపనమ్మకం?

'నేను మాట తప్పే మనిషిని కాను'

ఆమెపై తన ప్రేమ నిజాయితీదని నమ్మించాలని ప్రయత్నిస్తున్నాడు కీమ్వా.

కానీ ఆమె ముఖంలో ప్రతిఫలిస్తున్న భావాలు చూస్తూంటే ఆమె అతడిని నమ్మినట్టు కనబడటం లేదు. ఎందుకు తనపై ఇంత అపనమ్మకం?

అతడికేమీ బోధపడటంలేదు.



ఏంచేస్తే ఆమెకి తనపై నమ్మకం కుదురుతుంది?

'ఏంచేయాలి?'

అతడినే పరిశీలనగా చూస్తున్న 'యుహ్వా'కు అతడి సహనం నశిస్తోందని తెలుస్తోంది.

'ఇక ఇప్పుడు అరుపులు, బెదిరింపులు మొదలవుతాయి.

ఆ తరువాత దౌర్జన్యం' అనుకుంది.

కానీ ఆమె ఊహకు భిన్నంగా ప్రవర్తించాడు కీమ్వా.

'సరే. ప్రేమ అనేది రెండువైపుల ఉంటేనే ఆనందకరం. ఒకేవైపు ప్రేమవ్యక్తిగత సమస్య. ఇది నా సమస్య. నీ ఇష్టానికి నేను అడ్డురాను. నీ వ్యక్తిగత స్వేచ్ఛను హరించను' అన్నాడు.

ఆమె కళ్లెత్తి అతడి వైపు చూసింది.

అతడి కళ్లల్లో విచిత్రమైన భావన కదలాడింది.

'నువ్వు నన్ను ఇష్టపడనంత మాత్రాన  నా రాజ్యంలో నీకు ఆశ్రయం నిరాకరిస్తారని అనుకోకు. నా రాజ్యంలో నా ప్రజలు ఎంత స్వేచ్ఛగా, ఎంత భద్రంగా సంతోషంగా ఉన్నారో. నువ్వూ అంత స్వేచ్ఛగా, భద్రంగా, సంతోషంగా ఉండవచ్చు. అన్ని సౌకర్యాలు అందుతాయి. నన్ను ఇష్టపడనంత మాత్రాన శిక్షించే నైచ్యం నాలో లేదు' అన్నాడు.

వెనుతిరిగాడు

అతడివైపు విస్మయంగా చూసింది.

ఆమె పెదిమలు కదిలాయి.

వెళ్లబోయే అతడు ఆగాడు.

'నేను నది దేవత 'హేబెక్' కూతురిని. నా పేరు యుహ్వా' మెల్లిగా చెప్పింది ఆమె.

'అతని కళ్లల్లో ఏదో అర్థమైన భావన కదలాడింది.

'నీ సౌందర్యం దివ్యమైనది. మానవ మాత్రుల సౌందర్యం వారిది. నేను అప్పుడే అనుకున్నాను ఇంత అసమానమైన సౌందర్యం మానవులకు ఎలా సాధ్యమయిందని?' అన్నాడు.

కళ్లుదించుకుంది ఆమె.

'నువ్వు నన్ను తిరస్కరించటం పట్ల నాలో ఏమాత్రం అవమాన భావన ఉన్నా అది ఇప్పుడు పోయింది. నువ్వు దేవ కన్యవు. నేను మానవమాత్రుడను' అన్నాడు.

'అది కాదు. నేను చెప్పేది వినండి' అందామె.

*************

'నాకు ఇష్టంలేదు నాన్నా' అంది యుహ్వా.

సూర్యదేవుడు హేమోసు చాలా శక్తిమంతుడు. అతడు నిన్ను ఇష్టపడుతున్నాడు. అతడిని కాదని నిలవటం కష్టం' చెప్పాడు యుహ్వా తండ్రి హేబెక్.

'అదేమిటి నాన్నా. స్త్రీ, పురుషులు కలిసి ఉండాలంటే ఇద్దరికీ ఇష్టమై ఉండాలి. హేమోసుకు ఇష్టమైనంత మాత్రాన నేను అంగీకరించి తీరాలని లేదుకదా?' ప్రశ్నించింది యుహ్వా.

నిట్టూర్చాడు హేబెక్.

'ఈ ప్రపంచం చాలా చిత్రమైనదమ్మా. నియమాలు బలవంతుడి కయినా బలహీనుడికి అయినా ఒకటే. ఒకరకంగా ఈ నియమాలు బలహీనుడికి బలవంతుడినుంచి రక్షణ కల్పిస్తాయి. మరోరకంగా బలహీనుడు హద్దుదాటకుండా చూస్తాయి. కానీ బలవంతుడు నియమోల్లంఘన చేస్తే..అది కొత్త నియమంగా మారుతుంది. వాళ్ల నియమాలు వాళ్లు ఏర్పాటుచేసుకుంటారు. బలవంతుడు మంచివాడయినపుడే నియమాలు బలహీనుడికి రక్షణ కల్పిస్తాయి'.

తండ్రిని ఎప్పుడూ అంత నిస్సహాయుడిగా చూడలేదు యుహ్వా.

ఆమెకు ఆశ్చర్యం అనిపించింది. 'అంత బలవంతుడా సూర్యుడు?' అనుకుంది. 'ఏమో..చిన్నప్పటి నుంచీ నా ఇష్టమైనట్టు ఉండటం నాకు నేర్పించావు. మనం ఆత్మసాక్షికి తప్ప మరెవరికీ జవాబుదారీ కాదని నేర్పావు. భగవంతుడి ముందు తప్ప మరెవరి ముందూ తలవంచకూడదని చెప్పావు. మరిప్పుడిదేంటి?'

'జీవితం..ఇది జీవితం. జీవితంలో రాజీపడక తప్పదు. ఇక్కడ తల ఎత్తుకుని నిలిచే వాళ్ల తలలు తెగుతాయి. తలదించుకున్న వారి ప్రాణాలు మిగులుతాయి.

'ఏమోనాన్నా..నాకు హేమోసు నచ్చలేదు. అతడు బతిమిలాడటం నచ్చలేదు. బలవంతపెట్టటం నచ్చలేదు. ఇప్పుడు నిన్ను బెదిరించటం, నువ్వు బెదరటం నచ్చటం లేదు'

'నీ ఇష్టం తల్లీ. తన మాట వినకపోతే అనర్థం తప్పదన్నాడు'.

'చూద్దాం నాన్నా' అంది యుహ్వా ధైర్యంగా.

************

యుహ్వా, ఆమె చెల్లెళ్లు హాయిగా ఆడుకుంటున్నారు.

పచ్చటి చెట్లు, వాటిపై విరగబూచిన పూవులు. వారికి ఎంతో ఆనందం కలిగిస్తోంది.

'ఈ ప్రపంచంలో ఎంతో సౌందర్యం ఉందికదా. ఎంత చూసినా తనివితీదు.

'ఒక జీవితకాలం సరిపోదు' ఆనందంగా అంది యుహ్వా.

అంతలో అంత వెలుతురు. ఒక్కసారిగా చీకటైనట్టు తోచింది. ఏం జరుగుతోందో వారికి అర్థంకాలేదు.

'అక్కా..పరుగెత్తు, ఎవరో మనల్ని బంధిస్తున్నారు' భయంగా అరిచారు ఆమె చెల్లెళ్లు.

ఒక్క ఉదుటున లేచింది యుహ్వా. పరుగెత్తబోయింది. ఎవరో వాళ్లు కట్టేసినట్టున్నారు. ముందుకు తూలిపడింది.

'నన్ను రక్షించండి. నేను కదలలేకపోతున్నాను' సహాయం కోసం అరిచింది యుహ్వా.

ఆమె చెల్లెళ్లు ఆగలేదు. వెనక్కు తిరగలేదు. వాళ్లు ఒక్క క్షణం ఆలస్యం చేసినా వాళ్లూ చిక్కుకుపోతారు. ప్రాణరక్షణకు మించిన ధర్మం మరొకటి లేదుకదా!

నిస్సహాయంగా కనుమరుగువుతున్న చెల్లెళ్లను చూస్తూండిపోయింది యుహ్వా. 'ఏమిటిది? ఏమౌతోంది?' తనని తాను ప్రశ్నించుకుంది.

************

నేనెందుకు ఇష్టంలేదు? నాలో నీకు ఏంనచ్చలేదు?' సూటిగా ప్రశ్నించాడు హేమోసు.

నిర్భయంగా అతడివైపు సూటిగా చూసింది యుహ్వా.

'నన్ను బలవంతపెట్టటటం నచ్చలేదు. నాన్నను బెదిరించటం నచ్చలేదు. ఇప్పుడు నన్ను ఇలా ఎత్తుకురావటం నచ్చలేదు'

'కానీ అంతకుముందే నీకు నేను నచ్చలేదన్నావు. ఎందుకని నచ్చలేదు?'

'నచ్చలేదంటే నచ్చలేదు. అంతే. ఎందుకు, ఏమిటి అన్నది అనవసరం. అది నా ఇష్టం. అయినా బలవంతాన ఒక మనిషిపై ఇష్టాన్ని, ప్రేమను కల్పించటం సాధ్యమా?' సూటిగా ప్రశ్నించింది.

'నేను శక్తిమంతుడను. ప్రపంచానికి వెలుగునిస్తాను. నేను లేకపోతే ప్రపంచమే లేదు. అయినా నేనెందుకు నచ్చలేదు?'

'నాకు కావాల్సింది శక్తికాదు. మనసు. ఎదుటి వ్యక్తి కూడా స్వేచ్ఛ ఉంటుందని ఇష్టాయిష్టాలు ఉంటాయని గ్రహించి, అర్థంచేసుకుని, మన్నించే సహృదయం. అది నీకు లేదు. అందుకని నువ్వంటే నాకు ఇష్టంలేదు. ఇప్పుడు ఇలా బలవంతాన ఎత్తుకొచ్చిన తరువాత నువ్వెంత ప్రయత్నించినా నీపై ప్రేమరాదు' నిక్కచ్చిగా చెప్పింది.

ఇంతలో బయట కలకలం వినిపించింది. హేమోసు బయటకు వెళ్లి కాస్సేపటికి తిరిగి వచ్చాడు.

'మీ నాన్న యుద్ధానికి రమ్మంటున్నాడు. పోయి ఓడించి వస్తాను' అన్నాడు.

************

అలికిడి అయితే తల ఎత్తి చూసింది యుహ్వా.

ఎదురుగా విజయగర్వంతో నిలబడి ఉన్నాడు హేమోసు.

ఆ వెనుకే తలవంచుకుని నిలబడి ఉన్నాడు యుహ్వా తండ్రి హేబెక్.

'మీ నాన్న ఓడిపోయాడు. కానీ నీమీద ప్రేమతో నీతో వివాహానికి అంగీకరించాడు. లేకపోతే వివాహం లేకుండానే నిన్ను నాదాన్ని చేసుకునే వాడిని' అన్నాడు హేమోసు.

దీనంగా తల ఊపాడు హేబెక్.

************

అంతవరకూ ఆమె చెప్తున్నది వింటున్న కీమ్వా తల ఎత్తి ఆమెవైపు చూశాడు.

'తరువాత ఏమయింది?' అడిగాడు.

'వివాహమయింది. మోజు తీరింది. నాకన్నా అందగత్తెలు కనిపిస్తున్నారు. ఇక నాపై ఆసక్తి లేదని గ్రహించి నేను ఇష్టంలేని అతడిని వదలి పారిపోయి వచ్చాను. నన్ను వెతకలేదు కూడా అతడు. పీడాపోయిందని అనుకుని ఉంటాడు. అందుకే అజ్ఞాతంగా మీ రాజ్యంలో తలదాచుకుంటున్నాను' చెప్పింది యుహ్వా.

'అడుగు ముందుకు వేశాడు కీమ్వా'.

'నీమీద ప్రేమతోపాటు నాకు ఇప్పుడు గౌరవం కూడా మరింతగా పెరిగింది. కానీ నీ ప్రేమను పొందే అదృష్టం నాకులేదు' అన్నాడు విషాదంగా.

'మిమ్మల్ని స్వీకరించటంలో నాకు అభ్యంతరంలేదు. కానీ నేను గర్భవతిని' చెప్పింది యుహ్వా.

'అయితే ఏమిటి?' ప్రశ్నించాడు కీమ్వా.

ఆశ్చర్యంగా చూసింది ఆమె అతడివైపు.

'నాకు నువ్వు కావాలి. నీ మనసు కావాలి, నీతో కలిసి జీవించటం కావాలి' అన్నాడు కీమ్వా.

ఆమెకు ఏమనాలో తోచలేదు. తలవంచుకుని నిలబడింది.

అతడు దగ్గరగా వచ్చి చుబుకం పట్టుకుని తల ఎత్తాడు.

'జీవితంలో మనం ఎప్పుడూ తలదించుకోవద్దు. ప్రేమ మన శక్తి. ప్రేమించే వ్యక్తులు తలదించుకోరు. వారిని చూసి ద్వేషంతో నిండిన వారు తలలు వంచుకుంటారు' అన్నాడు.

'నాకు ప్రేమించటం నేర్పిస్తారా? నేను ప్రయత్నిస్తాను' అంది యుహ్వా మనస్ఫూర్తిగా.

■

## జోక్స్ కార్నర్

* తండ్రి: అదేమిట్రా భోజనం నుంచుని తింటున్నావ్?
కొడుకు: ఏంచేయను మరి, మీరేగా భార్య సంపాదిస్తుంటే నేను కూర్చుని తింటున్నానని తిట్టారు, అందుకే..

* భార్య: ఏమండీ మళ్లీ మన వాడు క్లాస్‌మేట్ పెన్ను కాజేసి తెచ్చాడండీ..
భర్త: వెధవకి అదేం పాడు బుద్ధి, ఆఫీసునుంచి నేను రోజూ పెన్నులు తెచ్చిస్తూనే ఉన్నాగా..

* సూర్య: రోజూ పిల్లిలా ఉండే మీనాన్న అరుస్తున్నా డేమిటోయ్?
సోము: ఇవాళ మా అమ్మ మౌనవ్రతంలే...

# పదాన్వేషణ-18

నిర్వహణ
గుల్ మహమ్మద్ నాయక్

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| R,A | B,E | C,L | S,W | M,N | D,P |

పిల్లలూ! కింది ఆధారాలకు ఎదురుగా ఉన్న అంకెలను చూడండి. ఆ అంకెలతో సంబంధం ఉన్న పై గళ్లలోని రెండు అక్షరాలతో ఆధారానికి తగిన జవాబును రెండు ఆంగ్ల పదాలతో రాయండి.

ఉదా:ఆధారం: డబ్బులు పెట్టుకునే చిన్న సంచి-5,6

అంటే 5వ గడిలోంచి ఒక అక్షరం, 6వ గడిలోంచి ఒక అక్షరం తీసుకుని జవాబు రాయాలి.

జవాబు: 5వ గడిలోంచి 'M', 6వ గడిలోంచి 'P' తీసుకుని 'MONEY PURSE' అని జవాబు రాయాలి.

ఆధారాలు:

1.మనకు అన్యాయం జరిగితే ఇక్కడకి వెళ్లి రిపోర్టు చేస్తాం .-6,4.........
2.సహోదరుల్లో పెద్దవాడు. - 2,2 ........
3.యంత్రము నడుపువాడు. -2,6 ..........
4.కుడి కాలువ - 1,3 .....................
5.ఒళ్లు నొప్పులు -2,6........

# రంగులు వేయండి



# ఎలుకా ఎలుకా

బాలగీతం



ఎలుకా ఎలుకా వస్తావా?
తియ్య తాయిలం నీకిస్తా

పిల్లీ పిల్లీ నే రాను
తియ్యగ నన్ను తింటావు

ఎలుకా ఎలుకా నే తినను
మాంసం తినటం మానేశా

పిల్లీ పిల్లీ నే నమ్మా
మూతికి ఏమిటి ఆ రక్తం?

ఎలుకా ఎలుకా రక్తం కాదది
తలుపుకు అంటిన ఎర్రని రంగు

పిల్లీ పిల్లీ మోసం ఆపు
ఎర్రని రంగని నమ్మకమేమిటి?

కావాలంటే వచ్చి చూసుకో
కావలసినంత నీవు పూసుకో

పిల్లీపిల్లీ కళ్లు మూసుకో
ఎదురుగ వచ్చి చూస్తాను

సరేసరే రా..రా..ఎలుకా
ఎదురుగ నిలబడి నీవే చూడు

కళ్లు మూసెను మోసపు పిల్లి
ఎదురుగు నిలిచెను
బలిసిన కుక్క.

**-దార్ల బుజ్జిబాబు**
**చిలకలూరిపేట.**



# రెండో సత్కారం

కథ



కల్లోల దేశాధిపతి తిక్కరాజు ఒకసారి సభలో బుద్ధిమంతుల పోటీ ప్రకటించాడు. పోటీలో ఎవరైనా పాల్గొనవచ్చనీ, అందరికంటే బుద్ధి కుశలత గలవాడికి చక్కని బహుమానం అందజేస్తాననీ తెలియజేశాడు.

తిక్కరాజుకున్న తిక్కని గూర్చి ఎరిగినవారవడంతో పోటీలో పాల్గొనేందుకు చాలా సేపటివరకూ ఎవరూ ముందుకి రాలేదు. దీనిపై తిక్కరాజు ఆశ్చర్యం వ్యక్తం చేస్తుండగా సభలో ఉన్న శిఖామణి అనేవాడు లేచి, 'మహారాజా బుద్ధి కుశలతలో మిమ్మల్ని మించినవాడు కల్లోల దేశంలోనే కాదు, ఈ భూమ్మీదే ఉండడు. ఆ సంగతి తెలిసే మీ సమక్షంలో పోటీకి ఎవరూ సాహసించట్లేదు' అన్నాడు.

శిఖామణి మాటలకు పొంగిపోయిన తిక్కరాజు అతనికి వంద బంగారు వరహాలిచ్చి సత్కరించాడు.

కానీ వెనువెంటనే తిక్కరాజు బుద్ధిహీనుల పోటీ ప్రకటించాడు. ఈసారి కూడా పోటీలో పాల్గొనడానికి ఎవ్వరూ ముందుకి రాలేదు. శిఖామణి మాటల్ని ఈ పోటీకి కూడా అన్వయించుకున్నాడు తిక్కరాజు. కోపంగా శిఖామణికేసి చూస్తూ, 'అంటే నా అంత బుద్ధిహీనులు కూడా ఎవ్వరూ లేరనేగా నీ ఉద్దేశం' అని గుద్దులిరిమి వంద కొరడా దెబ్బల్ని ఆదేశించాడు.

ఈ రెండో సత్కారం అందుకోక మునుపే శిఖామణి సభలోనే మూర్ఛపోయాడు.

**-మల్లారెడ్డి మురళీమోహన్, బెంగళూరు.**







# వార్త ఆదివారం

## తేడాలు గుర్తిస్తారా





## హలో ఫ్రెండ్...



చిన్నారుల ప్రశ్నలకు

వార్త సిఎండి, మేనేజింగ్ ఎడిటర్

**గిరీష్ అంకుల్ సమాధానాలు**

**ఎన్.వెంకటరమణ, వరంగల్.**

**ప్రశ్న: గిరీష్ సంఘీ అంకుల్ గారికి నమస్తే. నేను ఎనిమిదో తరగతి చదువుతున్నాను. మనిషి నీటిమీద నడవలేడుకదా. మరి ఇతర జీవాలేవైనా నీటిపై నడిచేవి ఉన్నాయా? దయచేసి వివరించండి.**

**జవాబు:** వెంకటరమణా! పురాణాల్లో, కథల్లో మహాపురుషులు నీటిమీద నడిచి వెళ్లినట్లు చదువుతాం. కానీ సాధారణ మానవుడికి నీటిమీద నడక ఇప్పటికీ అద్భుతమైన కలే. అయితే నీటిమీద నడిచే కొన్నిజీవాలు ఉన్నాయి. ఉదాహరణకు.. నీటి లోతుతో పనిలేకుండా వాటర్ స్పైడర్ నీటిమీద నడవగలదు. ఇది ఎంతో గమ్మత్తుగా నీటిమీద స్కేటింగ్ చేస్తూ ముందుకు సాగుతుంది.ఇది ఎలా సాధ్యమైందన్నది ఇటీవల కాలం వరకు అంతుపట్టని విషయంగానే ఉండేది. అయితే దాని కీలక రహస్యం వెల్లడయింది. శరీర నిర్మాణమే ఈ నడకకు ఎంతగానో తోడ్పడుతోంది. నీటిలో కిరోసిన్ వేసినప్పుడు తేలుతుందన్న విషయం మీకు తెలిసిందేకదా. ఏ వస్తువు సాంద్రత అయినా నీటికన్నా తక్కువ ఉంటే లేదా ఘనపరిమాణం విస్తరిస్తే తేలియాడుతుంది. నీటి తిమింగలం బరువు నూరు టన్నులు ఉంటుంది. ఇంత బరువున్న తిమిగలం నీటిపై తేలియాడుతోంది. అంటే అది తొలగించే నీటివల్ల దాని బరువు తగ్గుతుంది. వాటర్‌స్పైడర్ నీటిమీద నడక ఎన్నో శాస్త్ర సంగతుల్ని తెలియజేస్తుంది. చమురులాంటి పదార్థంతో నిండిన వెంట్రుకలు దీని కాళ్లకు ఉండటం వల్ల నీటిలో మునగకుండా నీటిమీద స్కేటింగ్ చేయగలుగుతుంది. అంతేగాకుండా నీటిని తాకే పాదాలు చుట్టుకొలత దీని నడకకు తోడ్పడుతోంది.అలాగే మధ్య అమెరికాలోని బాసిలిస్కస్ అనే బల్లులు నీటిపై చాకచక్యంగా నడుస్తాయి. కొన్ని కీటకాలు నీటిపై తేలుతూ వెళతాయి. వీటికి నీటిని వెనక్కితోసే రీతిలో పనిచేసే కాళ్లుంటాయి. వాటిని సూపర్ హైడ్రోఫోబిక్ లెగ్స్ అంటారు. నిరంతరం జరిగే పరిశోధనలు కొత్తకొత్త అంశాలను వెల్లడిస్తాయి.

**వై.రమ్య, చిత్తూరు.**

**ప్రశ్న: గిరీష్ సంఘీ అంకుల్ గారికి నమస్తే. నేను ఏడో తరగతి చదువుతున్నాను. చందమామ ఎలా ప్రకాశిస్తుంది?**

**జవాబు:** రమ్యా! చంద్రమామకు స్వయంప్రకాశక శక్తి లేదు. అయితే సూర్యకాంతి చందమామను చేరుతున్నందున అది ప్రకాశవంతంగా కనిపిస్తుంది. కానీ చందమామ సూర్యుడు ఉన్నంత ప్రకాశవంతంగా ఉండదు. కారణం తనపై ప్రసరించిన సూర్యకాంతిలో చాలాభాగాన్ని ఇది ఇముడ్చుకుంటుంది. సూర్యకాంతిలో 7 శాతాన్నే అది ప్రతిఫలిస్తుంది. అందువల్ల చంద్రకాంతి హాయిగా ఉంటుంది.

**జవాబులు**

**పదాన్వేషణ**

1.POLICE STATION
2.ELDER BROTHER
3.ENGINE DRIVER 4.RIGHT CANAL 5.BODY PAINS

**తేడాలు గుర్తిస్తారా**

1.తల్లి చేపకు ముక్కు లేదు 2.తల్లి చేపకు ఒక కనుబొమ అదనం
3.పిల్లచేప తలపై డిజైన్‌లో తేడా
4.పిల్లచేపకు ముక్కు అదనం
5.తల్లిచేప శరీరం చివర చుక్క.





# దేవాధిదేవుడు శివుడు!

డా. శ్రీసత్యగౌతమి, ఫిలడెల్ఫియా.




విశ్వపిత అయిన శివ పరమాత్ముడు భారతదేశంలో ఉద్భవించిన సమయానికి గుర్తుగా జరుపుకొనే పండుగే 'శివరాత్రి' పండుగ. ఆయనను పరమశివుడు, సదాశివుడు అని పిలుస్తారు. శివ అనేది సంస్కృత శబ్దం. దానికి రెండు అర్థాలు ఉన్నాయి. ఒకటి..'బిందువు', రెండవది 'కళ్యాణకారి'. అందుకే మొదటి అర్థం బిందువు ఆయన రూపానికి, రెండవది కళ్యాణకారి వారి కర్తవ్యానికి సరిపోతుంది. ఇతర మతాలవారు కూడా భగవంతుడు ఒక జ్యోతి స్వరూపమని, వెలుగనీ అంగీకరిస్తున్నారు. ఏసుక్రీస్తు 'గాడ్ ఈజ్ లైట్' అని అన్నారు కదా. శిక్కు ధర్మ స్థాపకుడు గురునానక్ పరమాత్మను 'ఓంకార్' అని అన్నారు. మిస్తులు శివలింగాన్ని అయిాసిస్, ఒసిరిస్ పేరుతో పూజలు చేశారు. ముస్లిములు 'నూర్-ఎ-ఇలాహి' అని అంటారు. శివలింగము పరమాత్ముని స్మృతిచిహ్నాము. అందుకే శివుడంటే దేవాదిదేవుడు.

అజ్ఞానాంధకార సమయంలో శివపరమాత్మ బ్రహ్మ శరీరంలో అవతరించి జ్ఞానప్రకాశమిస్తున్నారు. అందుకే శివుని భారతదేశంలో జ్యోతిర్లింగంగా పూజిస్తున్నారు. భారతదేశంలో ప్రసిద్ధి గాంచిన 12 మఠాలను కూడా ద్వాదశ జ్యోతిర్లింగాలని అంటారు. శివాలయంలో శివుని ఎదురుగా ఉన్న నంది బ్రహ్మకు చిహ్నామట. పరమాత్ముని నివాస స్థానము పరంధామము. వారు తల్లి గర్భం ద్వారా జన్మించరు, అవతరిస్తారు. కల్యాణకారిగా ఆయన ముఖ్య కర్తవ్యము జీవాత్మలను పాపులనుండి రక్షించి పావనం చెయ్యడం.



భూమిపై శివోద్భవం జరుగడానికి గల కారణం మనుసుల్లోని, అసుర లక్షణాలను రూపుమాపడానికి, మరి శివుడు రామునిలా విల్లు ఎక్కుపెట్టి అసుర సంహారం చెయ్యలేదు. కృష్ణుడిలా యుద్ధాలు జరిపించలేదు. ఆదిపరాశక్తిలా కూడా ఏ ఆయుధాలు ధరించి అసురులను తుదముట్టించలేదు. అయినా కానీ అతనికి లయకారుడనే పేరుంది. దానికి ఆధారంగా ఒకటి చెప్తారు..సృష్టికర్త బ్రహ్మ అని, పోషించేవాడు విష్ణువు అని, నాశనం చేసేవాడు శివుడని (అంటే మరణాల విషయంలో) అంటారు. కానీ ఈ లయం అనే మాటలో చాలా పెద్ద అర్థముంది. అది కేవలం మనిషి మరణ సమయానికి సంబంధించిన విషయం కాదు. పైన చెప్పినట్లుగా మనుషుల్లోని అసురలక్షణాలను లయం చెయ్యడానికి ఇది ఆయన తత్వం, శివతత్వం. మిగతా దేవతలు అవసరాన్ని బట్టి భూమి మీద అవతరించి అసురసంహారం చేసి అవతారాలు చాలించి వెళ్లిపోతే శివుడు మాత్రం నిరంతరం భూమి పర్యవేక్షణకోసమే లింగాకారంగా ఉద్భవించాడు, విశ్వమంతా తన తత్వాన్ని వ్యాపింపజేశాడు. అందుకే అతడు విశ్వపిత.

శివపురాణంలో ఆయన తత్వాన్ని విశదపరిచే ఒక కథ ఉంది. అడవిలో భిల్లుడు జంతువులను చంపుతూ తననీ, తన కుటుంబాన్ని పోషించుకుంటుంటాడు. అతడే పుణ్యకార్యాలు చెయ్యలేదు. ఒకనాడు జంతువేటకెళ్లిన భిల్లుడికి నిరాశే ఎదురైంది. చివరికి ఒక నీటి మడుగు దగ్గరకు వచ్చి ఆగాడు. ఆ నీరు తాగడానికి ఏ జంతువైనా రాకపోతుందా, తాను కొట్టకపోతాడా అని ఆ పక్కనే ఉన్న మారేడు చెట్టెక్కి పొంచి కూర్చున్నాడు. ఆ చెట్టు కింద శివలింగం ప్రతిష్టితమై ఉంది. ఈ లోపల ఒక లేడి అటుపక్కగా వచ్చింది. భిల్లుడు దాన్ని కొట్టడానికి విల్లు, బాణాన్ని సంధించేటప్పుడు అనుకోకుండా కొన్ని మారేడు దళాలు, తన భుజాన వేలాడే తాబేటికాయ నుండి జలము ఆ శివలింగంపై పడ్డాయి. ఆరోజు శివరాత్రి. అదేమీ తెలియని భిల్లుడు తన ఆహార సంపాదన గురించే ఆలోచిస్తున్నాడు. అయినా ఆ శివుడు ఆయనకు జరిగిన ఆ మాత్రపు అభిషేకానికి భిల్లుని పాప పంకిలాన్ని, క్రూరత్వాన్ని కొంతవరకు లయం చేశాడు. దానితో ఆ లేడి తన పిల్లల్ని తన భర్తకు అప్పగించి తిరిగి వచ్చి ఆహారాన్నవుతానని చెప్పగానే, క్రూరంగా ఆలోచించకుండా లేడిని తిరిగి రమ్మని పంపుతాడు. ఆపై మరో లేడి అటుపక్కకు వస్తుంది. మళ్లీ భిల్లుడు బాణాన్ని ఎక్కు పెడతాడు. మరికొన్ని మారేడు దళాలు, కాసిని నీళ్లు శివలింగం మీద పడతాయి. ఆ పరమశివుడు భిల్లునిలోని క్రూర లక్షణాలను మరింత తగ్గిస్తాడు. ఈ లేడి కూడా..ఇంటికి వెళ్లి పిల్లలను భర్తకు..తన అక్కకు అప్పగించి వస్తానని చెప్పింది. భిల్లుడు ఇంకాస్త కరిగి దాన్ని పంపించేస్తాడు. మళ్లీ జంతువుకోసం ఎదురు చూడడం మొదలు పెడతాడు. ఇంతలోపు ఒక మగలేడి అటుగా వచ్చింది. భిల్లుడు మళ్లీ బాణాన్ని సంధించాడు.

అంతలోపు మరిన్ని మారేడు దళాలు, మరింత జలము తన తాబేటికాయనుండి శివునిపై పడ్డాయి. అప్పటితో శివుడు అతని క్రూరపు లక్షణాలను పూర్తిగా రూపుమాపాడు. ఆ మగలేడి కూడా ఒకటే అర్థించింది. తన పిల్లలను జాగ్రత్తగా చూసుకోమని తన ఇద్దరు భార్యలకు చెప్పి వస్తానని, భిల్లునికి జాలి మొదలయ్యింది. ఆ మగలేడి వెనుదిరిగి వెళుతూ కాస్త దూరంలోనే తన ఇద్దరు భార్యల్ని కలిసింది. ఆ మూడు లేళ్ల భిల్లుడికి చేసిన సత్యశపధాలను ఒకరికొకరు చెప్పుకొని తమ పిల్లలను ఇరుగుపొరుగు లేళ్లకు అప్పజెప్పి వెనుకకు తిరిగివద్దామని నిర్ణయించుకుంటాయి.

పరమశివుని దయ వలన పరివర్తన చెంది ఉన్నాడు కాబట్టి వాటి సంభాషణ విన్న భిల్లునికి ఇచ్చిన మాటకోసం ప్రాణాలను సైతం లెక్కచెయ్యని వాటిలోని ఉత్తమ లక్షణానికి చలించిపోయాడు. 'జంతుజన్మ ఎత్తినా వాటికి సత్యవాక్య పరిపాలన ఉంది, మనిషి జన్మమెత్తిన నేను ఇన్నాళ్లు జీవహింస చేస్తూ హేయమైన జీవితాన్ని గడిపాను' అని పశ్చాత్తాప పడి వాటిని ఆదరించి వెనుకకు పంపిస్తాడు. ఆపై వెంటనే శివుడు ప్రత్యక్షమయి మరుసటి జన్మలో శ్రీరామునికి సేవచేసుకునే భాగ్యాన్ని వరంగా ప్రసాదిస్తాడు. అతడే గుహుడు. ఈ కథద్వారా శివరాత్రి పూజ మహత్మ్యం తెలుస్తున్నది. ఇలా అసుర లక్షణాలను పోగొట్టి మంచి మార్గాన పెట్టగలిగే గురు తత్త్వం శివునిలో ఇమిడి ఉంది. తాను వరమిచ్చినా అది అందుకోక తమ మార్గాన్ని మార్చుకోలేని పాపులను శిక్షించే తత్త్వమూ ఆ పరమశివునిలో ఉంది. అంతేకాకుండా సాధారణంగా పండుగ అనగానే రుచికరమైన పంటకాలను తయారు చేసుకొని భుజిస్తారు కానీ శివరాత్రి పండుగనాడు ఉపవాసం ఉంటారు. ఉపవాసం అంటే దగ్గరగా నివసించటం. అర్ధరాత్రి శివాలయాలలో అభిషేకాలు చేస్తారు. భక్తులు ఆ సమయాన్ని లింగోద్భవ సమయమని అంటారు. అంటే అది శివుడు అవతరించిన సమయమని అర్థం. అది కూడా మాఘ బహుళ చతుర్దశి అంటే పూర్తి అంధకార సమయం. ఇది అజ్ఞానాంధకారానికి గుర్తు. ఈ సమయంలోనే శివుడు అవతరించి జ్ఞాన ప్రకాశాన్నందిస్తాడు. మనుషులను దేవతలుగా మారుస్తాడు. మన ఆత్మలలో అనేక రకాలున్నారు. పుణ్యాత్మ, పాపాత్మ, దేవాత్మ, మహాత్మ. కానీ పరమాత్మ ఒక్కరే. పరమాత్మ సర్వశక్తిమంతుడు, సర్వ దివ్యగుణాల సాగరుడు, దుఃఖహర్త- సుఖకర్త, శాంతిసాగరుడు, ఆనంద సాగరుడు, ప్రేమసాగరుడు.

అయితే ఆత్మల్లో ఇన్నిరకాల ఆత్మల సృష్టి ఎందుకు చెయ్యాలి? మరలా ఎందుకు శిక్షించాలి అనే ప్రశ్న ఎదురవుతుంది. ఇన్ని రకాల ఆత్మలు దైవసృష్టి కాదు, మానవులు చేసుకున్నదే. దేవుని సృష్టి నుండి పదహారు కళలనీ (సామము, దానము, వేదము, సాహసము, యుద్ధనీతి, రాజనీతి, సత్యము, సత్వము, రజో, తామస, అహింస, విద్యా విజ్ఞానం, లక్ష్మి, పుణ్యము, కళాపోషణ, స్థిరత్వము) పుణికి పుచ్చుకొని కృతయుగంలో స్వచ్ఛమైన ఆత్మలు భూమి మీదకి మొదటిసారిగా విలసిల్లితే.. రానురానూ కలి పురుషుని చూపు తగిలి త్రేతా, ద్వాపర చివరకి కలియుగం వచ్చేటప్పటికి కళలన్నీ పోగొట్టుకొని కేవలం కలి లక్షణాలతోనే వట్టిపోయిన ఆత్మలు మానవాకారాలతో తిరుగుతాయి.

కలి లక్షణాలేమిటయ్యా అంటే ఆ పదహారు కళలకి వ్యతిరేకాలే, వికృతి రూపాలే! కలి ప్రభావ లక్షణాలు..మంచి తల్లిదండ్రులను పిల్లలు బాధపెట్టడం, కన్న పిల్లలనే చెడువైపు మళ్లించి పబ్బాలు గడుపుకునే తల్లిదండ్రుల్వడం, స్నేహితులని గుడ్డిగా నమ్మి మోసాలకు గురవ్వడం, అబద్ధాలు ఆడడం, పెద్దల్ని, పండితులని పరిహసించడం, డాంబికాలు పలకడం, ఆడంబరాలకు పోయి అప్పుల పాలవడం, దొంగతనాలు, వ్యభిచారం తద్వారా చెంచులక్షిని పొంది స్థిరలక్ష్మికి శాశ్వతంగా దూరమవ్వడం, రోగాల పాలవ్వడం, మూర్ఖత్వం, ఒకటి ఆలోచిస్తూ మరొకటి మాట్లాడుతూ ఇతరులను చాటు దెబ్బతియ్యడం, కర్కశత్వం, అల్పజ్ఞానం, అల్పాయుర్దాయం, శిశుహత్య, గోహత్య, పరుల ధనాలను దోచుకోవడం, హత్యలు చెయ్యడం, అన్యాయపు ప్రవృత్తినే వృత్తిగా చేసుకొని ధనార్జన చెయ్యడం, దొంగ సాక్ష్యాలు సృష్టించి ఇతరుల మనస్సును బాధ పెట్టి వినోదించడం, జీవనోపాధిలేనివారు కాషాయాన్ని కట్టుకొని ప్రజల్ని మోసగించి ధనాన్ని, స్త్రీలను పొందడం, పెద్దలకు కర్మ కాండలు చెయ్యకపోవడం, తాత్కాలిక, అన్యాయపు, అల్ప సంతోషాలకోసం క్షుద్రదేవతలను పూజించి ఆ శక్తులను వదిలి ఇతరులను బాధపెట్టడం.

మరి ఈ కలినుండి విముక్తిలేదా? కొంతమందికి ఉంటుంది, కొందరికి ఉండనే ఉండదు. వీళ్లు మహాపాపులై పాప, క్రూర కర్మలు చేస్తూ..ఆ దోష ఫలితాలను, వారిని అనుసరించుకుంటూ బతికే వాళ్లకి, చనిపోయి స్వర్గాన ఉన్నవారి పెద్దలకు కూడా పంచి ఆ పాపపు కూపంలోకే లాగిపారేస్తారు. ఈకాలంలో పాప పుణ్యాలేమిటి, అవి ఎక్కడ కనబడతాయి, వాటికి ఆధారాలు తీసుకురమ్మని కలియుగ ప్రశ్నలు తెలివిగా అడుగుతుంటారు. ఎందుకంటే వాళ్లు తాము కలి ప్రభావ లక్షణాలలో కూరుకుపోయి ఉన్నారని గ్రహించలేకపోవడం వల్ల. ఆఖరికి దివ్యమంగళ స్వరూపంతో ఆ దేవుడు కనిపించినా.. ఏవో తనకి ఎప్పుడో జరిగిన చిన్నచిన్న అత్యాశపు నష్టాలని గుర్తుచేసుకొని..ఈ దేవుడుండి ఏమిటి లాభము, నేనానాడు అన్ని కష్టాలు పడినప్పుడు ఏమిచేశాడని ఈరోజు నేను చేతులెత్తి మొక్కాలి అని ప్రశ్నించుకుంటాడు. అంతే తప్ప ఆనాడు తనవి న్యాయమైన కోరికలు కావు. అందుకే దేవుడు సహకరించలేదు అని మాత్రం ఆలోచించడు. జనరల్ ఎనస్తీషియా ఇస్తే బ్రెయిన్ పరిస్థితి ఎలా ఉంటుందో కలిపట్టిన బుద్ధికూడా అంతే. కాబట్టి వీళ్లకి ఇక విముక్తేలేదు. మరికొంతమందికి కలిప్రభావం నుండి బయటపడగలిగే అవకాశం ఉంటుంది. జన్మజన్మాంతరాన వీళ్లు ప్రారబ్దాలకు లోనయి కొన్ని కళలను పోగొట్టుకున్నా, ధార్మిక అనుకరణల వల్ల, సాధనలవల్ల పూర్తిగా కలావిహీనులు కారు. శివుడు హంసనీతి గలవాడు. పాలకి పాలు, నీళ్లకి నీళ్లు వేరుచేసి చూస్తాడు. చేసిన చెడు ప్రారబ్దాలకి కలి పాలన పడి బాధలు అనుభవించినా, చేసుకున్న ధర్మాల వల్ల ఆ ప్రభావం నుండి బయటపడేస్తాడు. దానికి కూడా మన సాధనే తప్పక అవసరం. దేవుడు దానికి కేవలం సారథ్యం వహిస్తాడంతే. ఇందుకు ఉదాహరణగా నలదమయంతుల కథని చెప్పుకోవచ్చు. ఎంతో ఓపికగా ఎదురుచూసి కలి, నలుడి బుద్ధిలోకి దూరేసరికి కలికి పదిహేనేళ్లు పట్టింది. అప్పట్నుంచి నలునికి మతిమరుపు, మందబుద్ధి కావడం, అడవులపాలవడం జరిగింది. తన భార్య దమయంతిని కూడా దారిమధ్యలో వదిలేసి వెళ్లిపోవాలనే బుద్ధికూడా కలిగింది. అయినా సరే నలుడు తనదైన ధర్మాన్ని వదలక, తన మంత్రిశక్తిని ఉపయోగించి కలిపురుషుడిని బయటకు తగలేశాడు. కలిని జయించగలిగినవారికే శివుడు చేతికి బెత్తం ఇచ్చి వారిద్వారా దుర్మార్గాన్ని తుదముట్టిస్తాడు. అందుకే ఎవరి అంతం ఎవరిచేతిలో ఉందో అంటారు. వారు చచ్చేంతవరకే వీరి ఆటలు. ఇదే ధర్మసూక్ష్మం. కాబట్టి ఏ ప్రమేయం లేకుండానే ఎవరెవరి ద్వారానో ఇబ్బందులకు గురవుతున్నామని, వారు దుఃఖ పడుతున్నారని బాధపడే లేదా దుఃఖపడే సందర్భాలు మంచివారికి కలుగుతుంటాయి. మంచివారిని అకారణంగా బాధపెట్టడం వల్ల కలివల్ల దోషపూరితమయిన వాళ్లు వారే దుఃఖసాగరంలో మునిగిపోవడం తథ్యం. ఇలా శివుడు వారిని అంతం చెయ్యడానికి తన భక్తులని, ధర్మాత్ములని, మంచివాళ్లనే ఆయుధాలుగా చేసుకోకతప్పదు. కాబట్టి చివరికి వాళ్లని శిక్షించి వీళ్లని రక్షించే పనిలోనే ఎప్పుడూ ఉంటాడు. ■



# నచ్చిన కోడలు వచ్చింది

- డా॥ మంతెన సూర్యనారాయణరాజు

**టీచర్ ఇంటర్వ్యూకి వెళ్లి వచ్చినప్పట్నుంచీ మా పెంటారావు ఎవరితోనూ సరిగా మాట్లాడ్డం మానేశాడు. అసలెందుకు మాట్లాడ్డంలేదో ఒక స్నేహితుడిగా అడుగుదామని "ఒరేయ్! నీకంటూ వున్న స్నేహితుడిని నేనేగా! కారణమేంటో చెప్పు. ఇప్పటికి ఉద్యోగంకోసం నువ్వు హాజరైన ఇంటర్వ్యూలెన్ని?" అని అడిగా.**

నెమ్మదిగా నూతిలోంచి వస్తున్నట్లుంది పెంటారావుగాడి గొంతులోంచి వచ్చేమాట.

"పది ఉండొచ్చు. కారణమంటే కారణమేం లేదు. నన్ను ఒక పాట పాడమన్నారురా! నాతకస్సలు పాటలు, పద్యాలు రావని నీకు తెలుసుగా! అయినా ఏదోటి పాడేద్దామని 'దురదదండోయ్ బాబూ... దురద...' అంటూ టి.వి.లో ఇచ్‌గార్డ్ ప్రకటన పాట అందుకున్నా! ఇంటర్వ్యూ చేస్తున్న ముగ్గుర్లో ఒకడు "ఆపెహె" అంటూ ఇంకా ఏవో అన్‌పార్లమెంటరీగా మాట్లాడ్డం మొదలెడితే నేను ఊరుకోకుండా "వాషింగ్ పౌండర్ నిర్మా... నిర్మా..." అంటూ ఇంకోటి అందుకున్నా!

అంతే! వాడు నాపై కొట్టినంత కోపం ప్రదర్శిస్తూ "నువ్వు టి.వి. ప్రకటనలు బాగా చూస్తావు గావును. వెళ్లిరా! ఇది పంతులు ఉద్యోగంకోసం ఇంటర్వ్యూ తెలుసుగా!" అంటూ నా బుర్ర తినేసేటట్లు క్లాసు పీకాడు. అంతే.. తిరిగి చక్కావచ్చా! అసలీజన్మలో నాకు ఉద్యోగం వస్తుందన్న నమ్మకం కూడా పోయిందిరా!" అన్నాడు. ఆఖరి మాటలు అనేటప్పుడు వాడి గొంతు దుఃఖంతో పూడుకుపోయింది.

నేను వాణ్ణి నిరుత్సాహపరచడం ఇష్టంలేక "పోన్లేరా! నీకొచ్చిన లోటేంటిప్పుడు? మీ అమ్మా-నాన్నలకు ఒక్కగానొక్క సంతానానివి" అంటూ నా దారిన నేను లేచిపోతుంటే-

పెంటారావు తండ్రి రాజరత్నం అడగనే అడిగాడు "ఏమంటున్నాడు మావాడని".

"మీరు వాణ్ణి వేపుకుతినకండి. ఇప్పుడు అర్జెంటుగా ఉద్యోగం చేసి మిమ్మల్ని పోషించాల్సిన అవసరం లేదుగా! అనవసరంగా వాణ్ణేం అనకండి" అన్నాను.

"రమేష్! నిజమే అనునులే! ఇంతకీ అసలేం జరిగిందో! అంటూ తండ్రిగా వాడు నాకు ఏదోటి చెప్పకపోతే ఎలా తెలుస్తుందో నువ్వైనా చెప్పు. వీడో బుర్ర తక్కువ సన్యాసి. దేవుడి దగ్గర నిత్యం పూజ చేస్తూ మూగవాడిలా గంట వాయించడం తప్ప మంత్ర తంత్రాలేమీ మచ్చుకైనా రావు. ఏవైనా చదవమంటే దేశభక్తి గీతం చదివేటటువంటి అవివేకి. ఏది ఎక్కడ ఎలా మాట్లాడాలో కొంచెమైనా గ్రహింపు లేని శుంఠ. అందుకే నా బాధంతా! వీడెక్కడికి వెళ్లినా వెళ్లిన చోటల్లా సున్నపుకాయలా వ్యతి రేక ఫలితాలే



తగలడతాయి. ఉద్యోగం ఎప్పుడొస్తుంది. ఇలాగైతే పిల్లనెవడిస్తాడు వీడికి?" అంటూ అంగలార్చాడు, రాజరత్నం.

"అవన్నీ ఎందుకిప్పుడు? పోనీయండి. మీరు వాడిని ప్రతిదానికీ నిలదీయొద్దు. ప్రతి చిన్న పనికీ పెద్దగా బాధపడే స్వభావం వాడిది" అన్నాను.

"రమేష్! నిజమేననుకో! పనీ పాటా లేకుండా ఇలా బేవార్సుగా ఎన్నాళ్లు తిరుగుతాడు చెప్పు. ఒక పక్కనుంచి ఏజ్ బారైపోతుంటే" అన్నాడు, రాజరత్నం.

మరునాడు పొద్దున్నే పెంటారావు కంగారు కంగారుగా రమేష్ ఇంటికొచ్చాడు. తలుపు దబా దబా బాదేస్తూ "రమేష్! రమేష్!" అంటూ చెవికోసిన మేకలా అరుస్తున్నాడు.

గొంతు ఆనవాలు పట్టి మళ్లీ ఏం కొంప మునిగిందోనని రమేష్ కళ్లు నులుముకుంటూ తలుపు తెరిచాడు. "ముందు లోపలికి రా!" అన్నాడు.

రమేష్ ఇక ఆ నిశ్శబ్దాన్ని భరించడం ఇష్టంలేక "మళ్లీ ఏం మిడిమేళం ముంచు కొచ్చిందిరా ఇంత పొద్దున్నే దిగబడ్డావ్!" అని ప్రశ్నించాడు.

"ఒరేయ్! నేను టీచర్ ట్రైనింగ్‌లో ఉండగా ఓ అమ్మాయికి లైనేశానని చెప్పాను, గుర్తుందా?" అంటూ ఆగాడు, పెంటారావు.

"ఆ... ఆ... గుర్తుందిలెద్దూ! ఆ అమ్మాయి వేరే కుర్రాడిని రిజిస్టర్ మేరేజ్ చేసుకుని, ట్రైనింగ్ డిస్కంటిన్యూ చేసి వెళ్లిపోయినట్టు, ఆ అమ్మాయి పేరు అదేదో గుండె గాబ్రా అనో, ఆల్‌జీబ్రా అని కూడా చెప్పినట్టు గుర్తుంది. ఇంతకీ సూటిగా విషయంలో కొచ్చేసేయ్" అంటూ విసుక్కున్నాడు.

"ఒరేయ్ రమేష్! నీ వెటకారం తగలెయ్యా! ఆమె పేరు గుండె గాబ్రా, ఆల్‌జీబ్రానో కాదు. నిక్ నేమ్ 'గ్రేబియేలా సెబట్టిని' అనే టెన్నిస్ ప్లేయర్ పేరు మా వాళ్లు బాగుంటుందని పెట్టారు. అసలు విషయానికే వస్తున్నా! ఆమెను రిజిస్టర్ మేరేజ్ చేసుకున్నవాడు తగవు పెట్టుకుని విడాకులు తీసుకోకుండా దుబాయ్ వెళ్లిపోయాడు.

స్నేహితుడు చెప్పింది విన్నాక రమేష్ "ఓరి శుంఠాగ్రేసర చక్రవర్తీ పెంటారావ్! నిన్ను ఏం చేస్తే పాపముందిరా వెధవాయ్! ఎప్పుడూ జీవితాన్ని సాఫీగా నడుపుకోవడం నీకు చేతగాదా! అసలు నీకు బుద్ధుందా! బుర్రుందా! అందులో ఉన్నదంతా మట్టేనా! ఆలోచించగల శక్తి నశించిపోయిందా!" అంటూ విసుక్కున్నాడు.

నిన్న రాత్రి నన్ను వెతుక్కుంటూ ఆమె మా ఇంటికొచ్చింది. అదృష్టంకొద్దీ మా అమ్మా, నాన్న సిన్మాకెళ్లారు. ఇంట్లో లేరు. ఆ పిల్లని అర్జెంటుగా తీసికెళ్లి మా పిన్ని ఇంటిదగ్గర అట్టేబెట్టి, ఆ విషయం ఎవరితో చెప్పొద్దని తిరిగి చక్కా వచ్చా! ఇప్పుడా అమ్మాయి నన్ను నువ్వు లోగడ ప్రేమించావు గదా! నిన్ను నేను ఇప్పుడు సెకండ్ మేరేజ్ చేసుకుంటాను అంటోంది. అదీగాక అప్పట్లో నేను వీరేశలింగంగార్ని ఆదర్శంగా తీసుకుని భర్త చనిపోయిన యువతినే పెళ్లి చేసుకుంటాను, భార్యగా స్వీకరిస్తాను" అనేవాడిని.

ఈ సెబటనీ "నన్ను భర్త వదిలేశాడు. అందుకని నీ ఆదర్శంకోసం నన్నెందుకు చేసుకోకూడదన్న కొత్త ప్రతిపాదన తీసుకొచ్చి మరీ వచ్చింది. పీకమీద కత్తిపెట్టి, పెళ్లి... పెళ్లంటూ కూర్చుంది. నాకిప్పుడేం పాలుపోక నీదగ్గరకొచ్చాను" అన్నాడు, పెంటారావు.

స్నేహితుడు చెప్పింది విన్నాక రమేష్ "ఓరి శుంఠాగ్రేసర చక్రవర్తీ పెంటారావ్! నిన్ను ఏం చేస్తే పాపముందిరా వెధవాయ్! జీవితాన్ని సాఫీగా నడుపుకోవడం ఎప్పుడూ నీకు చేతగాదా! అసలు నీకు బుద్ధుందా! బుర్రుందా! అందులో ఉన్నదంతా మట్టేనా! ఆలోచించగల శక్తి నశించిపోయిందా!" అంటూ విసుక్కున్నాడు.

పెంటారావు హర్ట్ అవుతున్నట్టుగా "అదేంట్రా అలా తిడతావ్ రమేష్! నాకేం చెయ్యాలో దిక్కుతోచక మిత్రుడిగా ఏదో సలహా ఇస్తావని నీ దగ్గరకొచ్చా! ఆ అమ్మాయంటే అప్పట్లో ఇష్టమే నాకు. అలాగని ఇప్పుడు మొగుడొదిలేసిన దాన్ని కట్టుకుంటే కొత్తగా ఏవేం సమస్యలొస్తాయో తెలీక ఇబ్బంది పడిపోతున్నా! ఆ అమ్మాయి అవ్వడానికి హిందువే! రేపు నన్ను ఈమెను పెళ్లాడితే జనం సెకండ్ హ్యాండ్ పెళ్లాం అంటూ ఏడిపిస్తారేమోనన్న భయం వెన్నాడుతోందిరా!" అంటూ దిగాలుగా కూర్చుండిపోయాడు.

రమేష్ "చూడు పెంటారావ్! నేనూ, మీ బాబాయ్ గోపాలరావు ఆ అమ్మాయితో మాట్లాడి వ్యవహారం సెటిల్ చేస్తాం. నువ్వేం పెద్దగా బాధపడిపోనవసరం లేదు. నీకైతే ఆమెను బుద్ధిపూర్వకంగా చేసుకునే ఉద్దేశం ఉన్నట్టా! లేనట్టా?! ఒకవేళ చేసుకుంటానంటే మీ అమ్మా, నాన్నల నుండి ఎదురయ్యే సమస్యలను నువ్వు ఫేస్ చెయ్యగల ధైర్యం ఉందా? బాగా ఆలోచించుకో!" అన్నాడు.

"ఓర్నాయనో రమేష్ నాకు అసలు పెళ్లి కాకున్నా బెంగలేదు. కానీ ఇప్పుడున్న సమస్యలకి తోడు ఈమె తలపోటూ నేను భరించగల శక్తి నాకు లేదు. ఆ అమ్మాయి చాలా ఫాస్ట్" అన్నాడు, పెంటారావు.

"ఆ... ఆ... అర్థమౌతోందిలే! ఆ సెబాటనీ ఫాస్టైతే, నువ్వు వట్టి పప్పుసుద్దవి. అన్నీ నేను చూసుకుంటాగాని, నువ్వెళ్లి నిశ్చింతగా ముసుగుతన్ని పడుకో!" అన్నాడు, తన పనుల్లో తాను నిమగ్నమౌతున్నట్టు రమేష్. పెంటారావు భారంగా ఇంటిముఖం పట్టాడు.

* * *

ఎలాగైతే మంచితనంగా మాట్లాడి పెంటారావు పినతండ్రి గోపాలరావు, రమేష్ ఇద్దరూ సెబటినీని బస్సు ఎక్కించేశారు. ఆమె ఎంత వితండ వాదనకు దిగి, ఆదర్శాలు వల్లించినా రాజరత్నం తోడల్లుడు గోపాలరావు, పెంటారావు స్నేహితుడు రమేష్ ఇరుకున బెట్టి ఆమె ద్వితీయ వివాహాన్ని వాయిదా వేయించగలిగారు.

రాజరత్నానికి అనుమానం కలిగి గోపాలాన్ని, రమేష్‌ని ఇంటికి రావలసిందిగా కబురెట్టాడు. ఇద్దరూ రాగానే భార్యను టీ తీసుకురమ్మన్నాడు.

ఆసక్తితో "ఏవిట్రా! మా వాడేదో ఎడ్వెంచర్ చేయబోయాట్ట, నిజమేనా!" అని ఆరా తీశాడు. రమేష్ "అంకుల్ మీ వాడు మెత్తనోడు. మెత్తనోడిని మొత్తబుద్దేస్తుందంటారే! అందువల్ల ఆ అమ్మాయి వాడిని బెదిరించి నెత్తికెక్కేందుకు ప్రయత్నించింది" అంటూ విషయం దాచకుండా చెప్పాడు. రాజరత్నం "నువ్వు స్నేహితుడివి కాబట్టి కాస్త తెలివిగా వ్యవహరించావు. నేనైతే మా పెంటారావొక శుంఠ అని అంటాను. ఎందుకంటావేమో! కారణాలు చాలానే ఉన్నాయి" అంటూ ఆగాడు. ఇప్పుడు గోపాలరావు నోరు విప్పక తప్పలేదు.

"ఇదిగో అన్నయ్యా! ముందు నువ్వా దూకుడు మాటలే మానుకోవాలి. అసలు వాడిట్లా తయారవడానికి కారణం ముమ్మాటికీ నువ్వే! బుద్ధిగా ఉండాల్సినవాడు మొద్దుగా తయారయ్యాడంటే వాణ్ణి నువ్వు నీ చెప్పుచేతల్లో పెట్టుకోవడానికి భయపెట్టడమే! కన్నకొడుక్కి కడుపునిండా అన్నం పెట్టడమెంత ముఖ్యమో, గుండెనిండా ధైర్యాన్ని నింపుతూ భరోసా ఇవ్వగలగడం అంతే ముఖ్యం. వాడికెటువంటి ఆలోచనలు, అభిరుచులున్నాయో తెలుసుకునేందుకు నువ్వెన్నడయినా ప్రయత్నించావా? ఇష్టంలేని చదువుల్ని చెప్పించి, వాడినెత్తిన రుద్దావు. అందుకే వాడలా తయారయ్యాడు. ఇంకా నయం 'సైకో'గా మారివుంటే నిన్నే ఇబ్బంది పాల్జేసేవాడు. పిల్లల్ని కనగానే సరికాదు. నీ నిరంకుశ ధోరణివల్లే పరీక్షలకి భయపడుతూ చదవడం, సిలబస్, పోటీ పరీక్షలు అంటూ నీ భావజాలాన్ని వాడిమీద రుద్దుతూ 99 శాతం రావాలని వాణ్ణి రాచిరంపాన పెట్టావు. అందుకే పన్నెండేళ్ల వయస్సులో నిద్రమాత్రలు మింగి లెటర్ రాసి ఆత్మహత్యా ప్రయత్నం చేశాడు. సకాలంలో వదినవల్ల, నేను రమేష్ అది తెలిసి వాణ్ణి ఆసుపత్రిలో జేర్పించి ప్రాణహాని జరగకుండా ఆపగలిగాం! ఇప్పుడు పెళ్లి సమస్య తీసుకొచ్చినామె నన్ను మీ పెంటారావు చేసుకుంటాడని గంపెడాశతో వచ్చానని మొండికేస్తే మేమిద్దరం ఆమెను బెదిరించి తన మాటలు తనకే అప్పజెప్పి, నీ ముందు భర్త మళ్లీ తిరిగొచ్చి నిన్నేలుకుంటానంటే అప్పుడు వీడితో కాపురం వదిలిపోతావా? అంటూ నిన్ను నమ్మలేం! అని బెదిరించి పంపించేశాం. ఇప్పట్నుంచైనా వాణ్ణేం అనకు. జరిగింది చాలు" అంటూ లేచాడు.

రమేష్ "అంకుల్! నేనూ వస్తాను, నాకు పనుంది" అంటూ తనూ లేచిపోయాడు. రాజరత్నం తనలో తాను ఉడుక్కుంటూ అన్నింటికీ వీళ్లిద్దరూ మా పెంటారావు చేసిన పెంటనే సమర్థిస్తారు" అంటూ గొణుక్కున్నాడు.

రాజరత్నం దగ్గర ముర్రా జాతి ఆవుందంటే కొందామని అతని అత్తారి ఊరాయన జానకిరామయ్య చుట్టం చూపుకనే వంకతో పెంటారావు ఇంటికొచ్చాడు. తమ ఊరివాడు ఎప్పుడూ రాని వ్యక్తి వచ్చాడంటే రాజరత్నం భార్య మర్యాదలు చేసి, టీ తీసుకొచ్చి యిచ్చింది.

"పదరా అబ్బాయ్! మీ ఆవును చూసి అన్ని విధాలా బాగున్నట్లయితే కొందామనుకుంటున్నా! మీ నాన్న దాని రేటెంత చెబుతున్నాడో!" అంటూ అడిగితే "నాకేం తెలీదన్నాడు" పెంటారావు. ఎందుకైనా మంచిదని జానకిరామయ్య ఆవు గుణగణాలు గురించి ఆరా తియ్యాలని "ఇది పాలు పితికేటప్పుడు తన్నడంగాని, కొమ్ములతో కుమ్మడంగాని చేస్తుందా?" అని అడిగాడు. ఆ సమయంలో రాజరత్నం పనుండి కూరలు కొనడానికి మార్కెట్‌కి వెళ్లాడు. దాన్ని అన్ని విధాలుగా సుడులు అవీ పరీక్షించాడు. జానకిరామయ్య ఏదీ చెప్పకుండా నోరు మూసుకున్నాడు పెంటారావు.

తిరిగి ఏదోటి చెప్పాలిగనుక ఉన్నవే చెబుదామనుకుని "ఏమో తన్నుతుందో లేదో నాకు తెలీదుగాని వెధవ ముక్కు పొడుస్తుంది. మరీ చిన్నపిల్లలైతే చిరాగ్గొడ్డుగనుక కుమ్ముతుంది. అదీగాక పాలు పితికేటప్పుడు మా అయ్య దాన్ని దువ్వుతూ తెలగపిండి పెడుతూనో, చిట్టు మేపుతూనో పాలు తియ్యాల్సిందే! అడప దడప నాలుగు బాదుతాడు కూడా!" అన్నాడు.

వేలకు వేలు పోసి దీన్ని కొన్నా ఇది పాలు సరిగ్గా ఇవ్వకపోతే డబ్బు దండగ అనుకొని నేను వెళ్తున్నానని చెప్పు" అని తన దారిన తాను వెళ్లిపోయాడు, జానకిరామయ్య. పెంటారావు తండ్రి రాజ రత్నం కూరల సంచి ఇంట్లో పెట్టి కొడుకు దగ్గరకొచ్చాడు. "ఒరేయ్! మీ తాతగారి ఊర్నుంచి వచ్చిన జానకిరామయ్యతో నువ్వు ఆవు పొడుస్తుందని వాగావట!" అన్నాడు.

"అదేవిటి నువ్వేగా అబద్ధాలాడకూడదని చెప్పింది" అంటూ ఎదురు ప్రశ్న వేశాడు, పెంటారావు.

"నా ఖర్మకొద్దీ కన్నాన్రా నిన్ను. వట్టి అప్రయోజకుడివి ఎలా పుట్టావో! నీకసలు బుద్ధెప్పుడొస్తుందో" అని నెత్తి, నోరూ కొట్టుకుంటూ ఇంకా కొడుకు దగ్గర ఉండటం ఇష్టంలేక పెళ్లాం దగ్గరకెళ్లి "పెద్ద సత్యహరిశ్చంద్రుడిలా నిజం చెప్పి తగలడ్డాడు వీడు. నువ్వెనా ఈ శనిగ్రహాన్ని పక్కకు పిల్చి ఉండాల్సింది" అన్నాడు. "నాన్నా! నీతో ఇదే పెద్ద చిక్కు. ఉన్నది చెబితే ఓ తంటా! చెప్పకపోతే మరో తంటా! నీ వరస నాకేం నచ్చలే!" అంటూ మూలుక్కున్నాడు.

* * *

గోపాలరావు, రమేష్, రాజరత్నం, అతని భార్య నలుగుతరూ పెంటారావు వాళ్లింట్లో సమావేశమయ్యారు. ఆ సమయంలో పెంటా రావు బైటికెళ్లాడు. అతని తల్లి రాజరత్నంతో "ఏవండీ! మన పెంటా రావుకి పెళ్లి చేసేద్దామండి. ఉద్యోగమంటే తర్వాత చూసుకోవచ్చు" అంది. పెళ్లాం అన్నదానికి చిర్రెత్తుకొచ్చి "అవునే.. పెళ్లి చేసేద్దాం! చేసేద్దాం" అని అంటున్నావుగాని, అసలింతవరకూ నీ కొడుక్కి వచ్చిన గాడిదకొడుకు ఒక్కడన్నా ఉంటేగా!" అంటూ దీర్ఘం తీశాడు, రాజ రత్నం. గోపాలరావు అందుకుంటూ "అన్నయ్యా! వాడికేం తక్కువ? కన్నోంకరా? కాలొంకరా? నీ వంశాంకురం నీ ఆస్తికి ఏకైక వార సుడు. నువ్వు కో అంటే కొండమీద కోతి కిందికి దిగివస్తుంది" అన్నాడు.

"బాగుంది నీ వరుస. కో అంటే కొండమీద కోతి దిగివస్తుంది సరే! పెళ్లికూతురెక్కణ్ణుంచి వస్తుంది? మంత్రాలకు చింతకాయలు రాలవు గదా! ఇప్పుడింత అర్జెంటుగా మా వాడికి పిల్లనెవరిస్తారు?" అని ఎదురు ప్రశ్న వేశాడు. రమేష్ "అంకుల్ వాడికి నచ్చిన అమ్మాయి ఎవరన్నా ఉన్నారేమో, కనుక్కోలేకపోయారా?" అన్నాడు.

"ఏడిసినట్టుంది నీ తెలివి. ఈ వాజమ్మనెవరు చూస్తూ చూస్తూ ప్రేమిస్తారు. బలుపుకీ-వాపుకీ తేడా తెలియని బడుద్ధాయైతే!" అన్నాడు.

"ఏవండీ! మీరింక ఆపుతారా? మన పిల్లల్ని మనమే ఆడిపోసు కుంటుంటే బైటవాళ్లెలా మన బిడ్డల్ని గౌరవిస్తారు? చెప్పండి. పెంటా రావు ఎటువంటి దుర్వ్యసనాలూ లేనివాడు. కాస్త చదువులో వెనక బాటుతనం, లౌక్యం తెలియకపోవడం మూలంగా మీరు వాణ్ణి వట్టి అప్రయోజకుడి కింద జమకట్టేస్తున్నారు. ప్రతీ కుక్కకీ ఓ రోజొస్తుందండీ!" అంది.

గోపాలరావు "వదినా ఈ కుక్కలూ, నక్కలూ అంటూ సినిమా, సీరియళ్ల భాష పక్కన బెట్టండి" అంటూ కర్తవ్యాన్ని గుర్తు చేశాడు.

రాజరత్నం అనుమానంగా భార్యను "ఏమోయ్! నీ సుపుత్రుడు ఎక్కడికెళ్లినట్టు?" అంటూ ప్రశ్నించాడు. ఆమె ఆలస్యం చెయ్యకుండా "నాకైతే ఏం చెప్పలేదు. మీకేమైనా చెప్పాడా!" అంటూ ఎదురు ప్రశ్న వేసింది.

అదే సమయంలో పెంటారావు పెండ్లి దుస్తుల్లో దండలు ధరించి ఒక యుక్త వయస్కురాలిని భార్యగా చేసుకున్నట్టు ఇంట్లోకి తీసుకుని చక్కావచ్చాడు. ఆ వధూవరులిద్దరూ ముందు రాజరత్నానికి, అతని భార్యకు, గోపాలరావు పాదాలకు నమస్కరించారు. ఉన్న ఆ నలుగు రికీ ఆ దృశ్యం ఆశ్చర్యం కలిగించడంతో ముందు అచేతనంగా నిలబ డిపోయారు. తర్వాత ఒకళ్ల ముఖం ఇంకోళ్లు చూసుకున్నారు.

పెంటారావు "నాన్నా! ఈమె నీ కోడలు. పేరు వసంత. మన పరమహంస మాష్టారి కూతురు. నేను అలా తోటలోకెళ్లి కూరగా యలు కోసుకొస్తుండగా నూతిలో దూకి ఆత్మహత్య చేసుకోబోతోంది. అప్పుడామెను కాపాడి పరమహంసగారి అంగీకారంతో గుళ్లో పెళ్లి చేసుకుని ఇంటికి డైరెక్టుగా తీసుకొచ్చా! మీతో బాబాయితో అమ్మతో రమేష్‌తో చెప్పే సమయం కూడా లేదు. అర్జెంటుగా పెళ్లి చేసుకో కుంటే ఆమె నిజంగా చనిపోతానని పట్టు బట్టటంతో ఇలా చెయ్యాల్సొచ్చింది" అన్నాడు.

రమేష్ "అమ్మాయ్! మీ నాన్నగారికి పెంటారావుని భర్తగా నీవు పొందడం ఇష్టమే కదా!" అంటూ నిలదీశాడు. ఆమె కాలిబొటన వేలు నేల రాస్తూ "మా నాన్న "ఇక నీ పెళ్లి చెయ్యడం నావల్ల కాదు. నీ చావేదో నువ్వే చావు" అన్నారు. దాంతో చేసేదేంలేక నా చావు నేనే చస్తుండగా "నేను నీకు అండగా ఉంటానన్నారు విశాల హృదయం గల పెంటారావుగారు. అటువంటప్పుడు పెంటారావుగారిని భర్తగా పొందటమంటే ఇష్టం లేకుండా ఎలా ఉంటుంది. ఆయన నా పాలిట దేవుడిలా ప్రత్యక్షమై మాంగల్య భాగ్యం కలిగించిన మహనీయుడు" అంది.

రాజరత్నం భార్య ఆనందంతో కోడలికి దిష్టి తీస్తూ "అమ్మా! నువ్వు నాకు దేవుడిచ్చిన కోడలివి. నీ ఆత్మహత్యా ప్రయత్నం నా కొడుక్కి భార్యని తీసుకొచ్చి పెట్టింది. మా పెంటారావును ప్రతీదానికి ...శుంఠ అంటూ మా ఆయనెప్పుడూ ఆడిపోసుకుంటారు. వాడు మిగిలిన విషయాల్లో ఎలాగున్నా పెళ్లి విషయంలో మాత్రం ఒక మంచి నిర్ణయం తీసుకున్నందుకు ఆనందంగా వుంది" అంది.

రమేష్, గోపాలరావు ఇద్దరూ, ఒకరు ఆంటీ నీ కోడలు రూపంలో తెలివితేటల్లో రతీదేవి, బృహస్పతిని మించినదని అంటే, గోపాలరావు సంసారపక్షమైన అణుకువ, పెద్దలపట్ల గౌరవ మర్యాదలు గలదని కితాబిచ్చారు. రాజరత్నం కలుగజేసుకుంటూ "అంతా వినండి... నాకు వచ్చిన కోడలు బాగా నచ్చింది. వీడికి పెళ్లి చెయ్యడం ఎలారా? దేవుడా! అనుకునే సమయంలో ఇలా రెడీమేడ్ కోడలు దొరకడం నా అదృష్టం. ఈ సంఘటన దైవికంగా జరిగినా నా కొడుకు అన్ని విధాలా అదృష్టవంతుడు. ఇటుపై వసంత మా వాడి జీవితంలో ఓ మాతృమూర్తిగా మారి మా వంశాన్ని నిలబెడుతుందనే గంపెడాశతో ఉన్నాను" అన్నాడు.

అతని భార్య "చూశావా మరిదీ! మీ అన్నయ్యకు అప్పుడే తాత అనిపించుకోవాలని ఎంత ఉబలాటంగా ఉందో!" అంది. అంతా ఒక్క సారిగా నవ్వుకున్నారు. ఆ ఇంట నవ్వులే పువ్వులై విరిసాయి. నూతన వధూవరులను చూసేందుకు జనం ఒక్కొక్కరే రావడం మొదలు పెట్టారు. వచ్చిన కోడలు నచ్చిందని అంతా ఆనందించారు. ■

## కార్టూన్లకు ఆహ్వానం

కార్టూనిస్టులనుండి ఆరోగ్యకరమైన హాస్యాన్ని అందించే కార్టూన్లను స్వాగతిస్తున్నాం. అంశం ఏదైనా సరే! మంచి హాస్యాన్ని అందించాలి. కార్టూన్లతోపాటు మీ పేరు, చిరునామా, హామీపత్రం తప్పనిసరిగా జతచేయాలి. ఎంపిక కాని కార్టూన్లను తిప్పి పంపగోరేవారు తగిన పోస్టేజీ జత చేసిన కవరు పంపించాలి.

కార్టూన్లు పంపించాల్సిన చిరునామా:

**ఎడిటర్, ఆదివారం వార్త నం.396, లోయర్ ట్యాంక్‌బండ్, డిబిఆర్ మిల్స్ పక్కన, హైదరాబాద్-80.**

ఈ వారం కవిత్వం

# ఊరు పారిపోతుంది!

ఊరు పారిపోకూడదు
పొలిమేర్లలోని
సర్కస్ డేరాలు చూసి!

ఊపిరి ఆగిపోకూడదు
సర్కస్ జంతువుల
జులాయితనాలకి జడిసి!

అవమాన కళేబరాలు
ఆహారంగా మారకూడదు
అమానుష మృగచేష్టలకి!

భయాల పొయ్యి పొగలు
ఇళ్ల పైకప్పుల నుండి వ్యాపించి
సర్కస్ పాత్రల ఉచ్ఛ్వాస నిశ్వాసాలు కాకూడదు!

ఏ జీవన నివాస ప్రాంతమైనా ఊరే!
ఈ ఊరూ ఆ వూరూ అని గాకుండా
ఊరూరా
సర్కస్ డేరాలు నాటుకొస్తున్నాయి!
ఆపై ఊళ్లన్నీ మూకుమ్మడిగా పారిపోతూనే ఉన్నాయి!

అవమానాలే అంది
'రాజపూజ్యం'
దక్కక
మంది
పారిపోతున్నారు!

పుంజీడు పెద్దలకే
పూజితమైపోయింది
ఈ 'రాజపూజ్యం!'

ఆకలీ, అవమానాలూ
మానవ చేష్టల ఫలాలే!
మానవ ప్రమాదాలకీ
మానవ ప్రమోదాలకీ
మానవుడే బద్ధుడూ,
బుద్ధుడూ!
మానవ పోరాటమే ప్రమాణం!
ఊరు పారిపోకపోవడమే
రాజపూజ్యం!

– ఒబ్బిని

---

# మార్కెటిజం

**ప్రపంచమొక** వ్యాపార సంద్రం అయ్యాక
గ్లోబల్ విలేజినే మింగే అనకొండ ప్రపంచీకరణం'
మనువు, మనసు అంగడి సరుకయ్యాక
లాభాల క్రీడా మైదానాల్లో "మానవత!"
టూరిజం చట్టభద్రతలో చట్టుబండలయ్యే
కన్నెరికం 'రాతిపూలు' పూయిస్తుంది ప్రతి రాత్రి!

మెమొరి కార్డుకు మెదడు బానిసయ్యాక
నీ జీవ చైతన్యానికి తులసీతీర్థపానమే!
ఆలుమగల అనుబంధ అనుభూతుల పుష్ప
మకరందాన్ని డాలరు తుమ్మెద తాగేస్తోంది!

రాలే కన్నీటి చెలమ కూడా ఎండిపోయాక
నీ మౌనగానం వినేదెవరు? మారేదెవరు?
నిప్పుకే చెదలు పట్టే తరుణంలో
'పోరే' నిత్య శ్వాస అవుతుంది
సింగపూర్ సివంగి ఆవహించిన అధినాయక గణం
నెట్‌లోనే సేద్యం చేస్తోంది
క్రికెట్ 'నెట్'కు చిక్కిన బాలచంద్రులు
పల్లెను.... ఇల్లును మింగే 'రాజధాని'లో
ప్రగతి కూలీలౌతారా?
అద్దెగర్భాలు అమ్మ(కపు) పాలు దొరికే చోట
'న్యూడ్' మూడ్‌లో డేటింగ్, కల్చర్‌లో
నీవు... నీ చిరునామా సమాధిరాళ్ల సరసనేగా!
రేపటి ఉదయంలా! నీ ఆలోచనే నీ ఆలంబన!

– తంగిరాల చక్రవర్తి

---

# ఎలా ఉంటుంది?

ప్రకృతిలో
పూలు–పిల్లలు–నవ్వులు
లేకపోతే ఎలా ఉంటుంది?

చెట్లు–వెన్నెల–వర్షం
లేకపోతే ఎలా ఉంటుంది?
మకరందం–కోయిలగొంతు–
మామిడి
లేకపోతే ఎలా ఉంటుంది?

అవన్నీ లేకపోతే
మనసే మోడుబోతే
మనిషి మృగం అవుతాడు.

మానవునిలో
మంచి–మమత–మానవత్వం
ఉంటే ఎలా ఉంటుంది?

కులం–మతం–ప్రాంతం
లేకపోతే ఎలా ఉంటుంది?

ద్వేషం–అసూయ–కోపం
లేకపోతే ఎలా ఉంటుంది?

ప్రపంచం వసుధైక
కుటుంబమై
మానవుడు దేవుడు
అవుతాడు.

– మార్టూరి శ్రీరామ్‌ప్రసాద్

---

## రచనలకు ఆహ్వానం

రచయితలనుండి కథలు, కవితలు, సమకాలీన వ్యాసాలు స్వాగతిస్తున్నాం. రచనలతోపాటు మీ పేరు, చిరునామా, హామీపత్రం తప్పనిసరిగా జతచేయాలి. ఎంపిక కాని రచనలు తిప్పి పంపగోరేవారు తగిన పోస్టేజీ జత చేసిన కవరు పంపించాలి. ఇతర పత్రికల పరిశీలనలో ఉన్న రచనలు పంపించకండి. **రచనలు పంపించాల్సిన చిరునామా:**

ఎడిటర్, ఆదివారం వార్త నం.396, లోయర్ ట్యాంక్‌బండ్, డిబిఆర్ మిల్స్ పక్కన, హైదరాబాద్–80




# కోడెదూడ

– వేముల ప్రభాకర్

**సెల్‌ఫోన్** రింగ్‌తోనే నిద్రనుండి మేల్కొన్నాను. నా బాల్య మిత్రుడు నారాయణ 'హలో' అన్నాడు.

దారి తప్పిన ఊరు, మరిచిపోయిన మిత్రులు సెల్ ఫోన్ పుణ్యమా! అని ఎక్కడున్నా పలకరిస్తుంటారు. 'మిత్రమా! బాగున్నావా?' అన్నాను.

"మా మనవడి ఆరోగ్యం బాగలేదు. నెలరోజుల్నుంచి కుటుంబ మంతా పరేషాన్‌లున్నం" అన్నాడు.

"చిన్నవాడు కదా! ఏమైంది వాడికి?"

"మాకు వాడొక్కడే మనవడు. అల్లారుముద్దుగా పెరుగుతున్న పిల్లవాడు. మా ఇంటి కోడెదూడ గురించి బెంగ పెట్టుకున్నడు. ఏమి తినడం లేదు. రెండు వారాల్నుంచి జ్వరం. జగిత్యాల తీసుకపోయి పెద్ద డాక్టరుకు చూయిస్తె "ఇది మానసిక సమస్య. ఆ దూడను జాడ తీసి తీసుకురమ్మంటున్నడు'.

మొదట నారాయణ చెప్పింది నాకేమి అర్థంకాలేదు. తర్వాత ఆయనిచ్చిన వివరణ ప్రకారం 'వాళ్ల ఆవు ఎనిమిది మాసాల క్రితం ఒక కోడెదూడకు జన్మనిచ్చింది. ఎనిమిదేళ్ల మనవడు రామన్నకు ఆ దూడంటె ప్రాణం. స్థానికంగా మూడవ తరగతి చదువుతున్న రామన్న బడి నుంచి రాగానే ఎక్కువ సమయం ఆ కోడెదూడతోనే గడిపేవాడు. 'భీమన్నా' అని దాన్ని ముద్దుగా పిలుచుకునేవాడు. ఆ దూడ కూడా ఒక్కపూట రామన్న కనబడకపోతే అరుస్తూ దొడ్లోనుండి ఇంట్లోకి వచ్చేదట. అదీ రామన్న-భీమన్నల అనుబంధం'.

వ్యవసాయానికి రవాణా అవసరాలకు ఎద్దులను విరివిగా వాడిన రోజుల్లో కోడెదూడలకు విలువ ఉండేది. ఇపుడు ట్రాక్టర్ల వాడకం పెరిగింది. రోడ్లమీద బస్సులెక్కు వయ్యాయి. ఎడ్లతో పొలం దున్నేవాళ్లు, ఎడ్లబండ్లల్లో ప్రయాణించేవారు చాలావరకు తగ్గిపోయారు. దాంతో ఎద్దుల అవసరం తగ్గిపోయింది, కోడెదూడల గిరాకి తగ్గిపోయింది. ఆవుదూడలైతె భవిష్యత్తులో పాలరాబడి పెరుగుతుంది, సంతతి కూడ ఎక్కువౌతుందన్న ఆశ రైతులది. కోడెలను ఎంత కాలం మేపినా చివరికి కోతకు పోవాల్సినవే కదా! అని వాటిమీద రైతులు సవతితల్లి ప్రేమ చూపిస్తున్న పాడు రోజుల్లో పుట్టడం భీమన్న దురదృష్టం.

ఊర్లో షాహుకారు రాజేశం ఇదే సంవత్సరం ధాన్యం, పసుపు, మిర్చి కొనుగోళ్లమీద ఎక్కువ పెట్టుబడి పెట్టాడట. కొనుగోలు చేసిన పంటతో గోదాము నిండింది. మార్కెట్లో మంచి ధరొస్తె 'ఎముడాల రాజన్న' గుళ్లో కోడెను కట్టేస్తానని మొక్కుకున్నాడట. ఆయన అదృష్టం బాగుండి ఇబ్బడి ముబ్బడి లాభాలొచ్చాయట. మరి మొక్కు చెల్లించాలి కదా! అని ఆలోచిస్తున్న సమయంలో షాహుకారు కన్ను నారాయణ దొడ్లో చెంగు చెంగున గంతులేస్తున్న భీమన్న మీద పడింది. అవసరానికి విత్తనాలు, ఎరువులు, పురుగుమందులు అరువిచ్చే షాహుకారు మాటను నారాయణ కూడా కాదనలేకపోయాడట.. పాత బాకీ కొంతైనా తీరుతుందని కొడుక్కు చెప్పాడట.

నారాయణ కొడుకు రాజంకు కోడెదూడను వదులుకోవడం ఇష్టం లేక "ఇంకొక్క రెండేళ్లు కాపాడితే మంచి ధరొస్తది నాన్నా" అన్నాడట తండ్రితో.

"భీమన్న పాలు కూడా మరువలేదు. ఆవును దూడను వేరు చేసిన పాపం మనకెందుకు?" అన్నదట, నారాయణ భార్య.

"కోడెదూడ పోతున్నది. దేవుని గుళ్లోకే. షావుకారుతోపాటు మనకు కూడా పుణ్యమొస్తది" అని సమర్థించుకున్న నారాయణ మనవడు బడికి పోయినప్పుడు షాహుకారుకు కోడెదూడను అప్పగించాడట.

అంతే! భీమన్న వేములవాడకు రవాణా అయిపోయింది. షాహుకారు మొక్కు తీరిందని చెప్పాడట.

బడినుంచి వచ్చిన రామన్నకు భీమన్న కనబడలేదు. మందనుంచి వచ్చిన ఆవు 'అంబా!' అని అరుస్తూ వారం రోజుల వరకు గడ్డిపోచ కూడా ముట్టుకోలేదట. భీమన్నను తెచ్చేదాక అన్నం ముట్టుకోనని రామన్న మొరాయించాడట.

"భీమన్నకేదో మాయర్యోగమొస్తే పట్నం పెద్ద దవాఖానకు పంపిచ్చింన్రు. మంచిగైనంక మళ్లీ మనింటికొస్తదని రామన్నను వాళ్ల అమ్మ సముదాయించిందట.

అమ్మ అబద్ధమాడదన్న నమ్మకంతో ఆ చిన్నవాడు ఒక వారం రోజులు ఓపిక పట్టాడట. పెద్దవాళ్ల ప్రవర్తన చూస్తుంటె వానికి అంతరాంతరాల్లో చిన్నగా మొదలైన అనుమానం పెనుభూతంగా మారడానికి ఎంతో కాలం పట్టలేదు. వాడు మంచం పట్టేసరికి నారాయణ కుటుంబమంతా పరేషాన్లో పడిపోయారట.

అన్నీ విన్నాక 'నారాయణా! మరిప్పుడేం చేద్దామనుకుంటున్నారు?' అన్నాను, నేను.

"కోడెదూడ దేవుని దగ్గరే ఉంటదికదా! దానితో ఒక్కసారి కలిపిస్తే నా మనవడు మామూలు మనిషవుతడు. నీకు ఆ దేవస్థానం ఆఫీసర్ పరిచయమని తెలిసింది. నువ్వాయనకొక మాట చెబితే వెళ్లి కలుస్తాం" అన్నాడు, నారాయణ.

నిజమే! నాగేంద్రశర్మ నాకు తెలిసినవాడే. ప్రస్తుతం అతనే వేములవాడ దేవస్థానం ఎగ్జిక్యూటివ్ అధికారిగా పని చేస్తున్నాడని విన్నాను. కానీ ఈ మధ్య కాలంలో అతనితో మాట్లాడలేదు. అయినా ఈ విషయంలో ఆలస్యం కుదరదని "నేను మాట్లాడి చెబుతాను. నీవు ఫోన్ పెట్టేయ్" మన్నాను, నారాయణతో.

సుదీర్ఘమైన నా ఫోన్ సంభాషణ గమనిస్తున్న మా శ్రీమతికి విషయం కొంతవరకు అర్థమైనట్టే ఉంది. నా మిత్రుడు నారాయణ కుటుంబ సభ్యులు ఆవిడకు తెలిసినవారే..

"ఏమిటీ! నారాయణ మనవడు జబ్బు పడ్డాడా?" అన్నది.

"ఇదో మానసిక సమస్య. నేను వివరంగా చెబుతాను. కానీ ముందు నాకు టీ కావాలని బాత్‌రూంలోకి వెళ్లాను. నేను బ్రష్ చేసుకుని వచ్చేసరికి ఆవిడ టీ ఇచ్చింది. టీ చప్పరిస్తూ రామన్న-భీమన్నల కథ చెప్పాను. ఆమె బాధపడుతూ "ముందా దేవస్థానం వాళ్లతో మాట్లాడండి" అన్నది.

నాగేంద్రశర్మగారు ఇంట్లోనే ఉన్నట్టున్నాడు. నేను ఫోన్ చేయగానే ఎత్తాడు. ఆయనకు విషయమంతా చెప్పాను. "కోడెదూడ జాడ దొరికితేనే చిన్నపిల్లవాడి ఆరోగ్యం బాగవుంతుంద"న్నాను.

నేను చెప్పిందంతా విన్నాక "ప్రతిరోజు స్వామివారికి భక్తులు కోడెలను సమర్పించడానికి తెస్తుంటారు. అందులో కొన్ని పాలు కూడా మరవని దూడలుంటాయి. ఇలాంటివి బతకడం కష్టం. అందుకని సంవత్సరం కూడా నిండని కోడెదూడలను ఎట్టి పరిస్థితుల్లోనూ ఒప్పుకోవడం లేదు. ఆ భక్తుని పేరు, ఊరు, మొక్కులు తీర్చుకున్న తారీఖు దానికి సంబంధించిన రసీదుతో పంపిస్తే తప్పకుండా వారికి సహాయం చేస్తాను" అన్నాడు, శర్మగారు.

ఆయనకు కృతజ్ఞతలు చెప్పాక నారాయణతో మాట్లాడి అన్ని వివరాలతో వేములవాడ వెళ్లమన్నాను.

"కోడెదూడను తీసికెళ్లిన షాహుకారుతో మాట్లాడి, వీలైతే ఆయనను తీసుకొని వెళ్తానన్నా"డు, నారాయణ.

ఆ తర్వాత వారం రోజులు గడిచాయి. నారాయణ నుంచి ఫోన్ రాలేదు. నా మనసులో రామన్న-భీమన్నలే మెదులుతున్నారు. ఎందుకైనా మంచిదని నాగేంద్రశర్మకే ఫోన్ చేసాను.

"మీ ఊరి నారాయణ నన్ను కలిసాడు. అసలా కోడెదూడను మా వాళ్లు ఒప్పుకోలేదట. కోడెలమ్మే సాయిబు చిన్నదూడను తీసుకుని వేరేదాన్నిస్తే మొక్కు పూర్తయిందట. ఆ సాయిబును కలవమని చెప్పా" నన్నాడు, శర్మ.

"సాయిబు చేతికి వెళ్లిన దూడ ఏ కబేళాకు వెళ్లిందో ఏమో!" నని మా ఆవిడ టెన్షన్ పడసాగింది.

సాయంత్రం వాకింగ్ పూర్తి చేసుకుని ఇంట్లో అడుగు పెట్టానో లేదో మా ఆవిడ ఎదురొచ్చి "ఫోన్ దగ్గర పెట్టుకోవద్దా? నారాయణ గారి ఫోన్ ఇంతకుముందే వచ్చింది. రామన్న-భీమన్నలను కలిపారట. చిన్న పిల్లవాడి ఆనందం చూశాక సంబరపడ్డ సాయిబు ఒక్క పైసా తీసుకోకుండా కోడెదూడను ఇచ్చేసాడట!" అన్న శుభవార్త చెప్పింది. ■

## వాస్తువార్త

వాస్తువిద్వాన్ సాయిశ్రీ
డా॥ దంతూరి పండరినాథ్
3-2-4, కింగ్స్‌వే, సికింద్రాబాద్- 3
సెల్స్: 9885446501/ 9885449458


# సంకీర్ణ దోషం అంటే..!?

**'అవ్యాత్తం క్షుద్భయం'.... గృహ ప్రధాన ద్వారం, ఇతర ద్వారాలు కూడా గృహ వైభవానికి (గృహ పరిమాణం) తగిన ప్రమాణంకంటే హెచ్చుగా వున్నట్లయితే 'సంకీర్ణ ద్వార దోషం' ఏర్పడుతుంది. ఇలాంటి దోషం కలిగిన గృహంలో నివసించేవారికి దారిద్ర్యం కలుగజేస్తుంది. గృహ నిర్మాణమప్పుడే గదుల పొడవు, వెడల్పు ముఖ్యంగా ఎత్తులను అనుసరించి ద్వారాల పరిమాణం (పొడవు, వెడల్పు, మందం) లను నిర్ధారించటం జరుగుతుంది. అంతకంటే హెచ్చు ఈ పరిమాణంలో ద్వారాలను ఏర్పాటు చేయటం వలన ఆ దోషం కలుగుతుంది.**

ఒక ఇంట్లో నివసించేవారు దారిద్ర్యాన్ని అనుభవించటానికి అనేక కారణాలుంటాయి. ఒకవేళ ఆ ఇంటికి ఇలాంటి దోషం ఉన్నట్టుగా గమనించినట్లయితే వారు ఈ దోషం వలననే దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నారని నిర్ధారణ చేసుకోవచ్చు. ఆ ద్వారాలను వాస్తు ప్రమాణాలకు దగ్గరగా సరిచేసుకొని ఏర్పరుచుకున్నట్లయితే దారిద్ర్య బాధలు తప్పకుండా తగ్గుముఖం పడతాయి.

### ప్రత్యామ్నాయాలు ఉన్నాయా?

రెడ్డి - చీరాల

**ప్రశ్న: మా ప్రధాన ద్వారంలోకి 'భూగర్భంలో' బోరు, నీళ్లసంపు, పంపుమోటర్లు వున్నాయి. వాటిని మార్చడానికిగానీ, మెయిన్ గేటును మార్చడానికిగానీ అసలే వీలు లేని స్థితి. ఇలా వుండడం ఇంటికి క్షేమదాయకమేనా? లేక ఏమయినా ప్రత్యామ్నాయ మార్గాలున్నాయా?**

**జవాబు:** ప్రధాన ద్వారానికి ఎదురుగా వుండకూడనివి ఎన్నో వున్నాయి. అందులో మీరు పేర్కొన్నవి కొన్ని. ఇవన్నీ ప్రధాన ద్వారానికి ఎదురుగా రాకూడదు. బయట నుండి ఇంట్లోకిగానీ, ఇంట్లోనుండి బయటికి గానీ వచ్చేటప్పుడు వీటిపై నడుచుకుంటూ వెళ్లకూడదు. తప్పకుండా సరైన స్థానంలోకి వీటిని మార్చాలి. అండర్ గ్రౌండ్‌లోనే బోరుని పైపుతో మరొక దిశకి మార్చటం మినహా చేయగలిగిందేమీ లేదు. వీటన్నింటినీ మార్చే అవకాశాలు లేకపోతే, ద్వారాన్ని వాస్తుపరంగా అనువయిన చోటుకి మార్చే వీలుందేమో చూడండి. ఇటువంటి సందర్భాలలో వాస్తు నిపుణులకు గృహాన్ని ప్రత్యక్షంగా చూపించి వీలయినన్ని సవరణలు చేయించుకుంటే మంచిది. ప్రత్యామ్నాయ పద్ధతులు వుంటాయి. కానీ అన్ని సందర్భాలలో కుదరవు. మీ విషయంలో తప్పకుండా మార్పులు చేసుకోవలసిందే!

### ఈ స్థలం మాకు కలిసివస్తుందా?

జయశ్రీ - అనపర్తి

**ప్రశ్న: ఈ మధ్య కాలంలో మేం ఒక స్థలం కొనుగోలు చేశాం. ఆ స్థల వివరాలు మీకు పంపిస్తున్నాను. ఆ స్థల మంచి-చెడులను వివరంగా తెలియచేస్తారని ఆశిస్తున్నాను.**

**జవాబు:** తూర్పు, ఉత్తరాలకు వీధులున్న ఈ స్థలాన్ని 'ఈశాన్య స్థలం' అంటారు. ఈశాన్యం చక్కగా పెరిగిన స్థలం స్వరూప రీత్యా చాలా బాగుంది. పటాన్నిబట్టి స్థల స్వరూపం తెలుస్తుంది. స్వభావం చెప్పే వీలు లేదు. మట్టి రంగు, నేల దృఢత్వం, మట్టి స్వభావం, రుచి, వాసనలు మొదలైన వివరాలు గ్రహించి ఫలాఫలాలు వివరించవచ్చు. స్థల నైసర్గిక స్వరూపం కూడా పటంలో తెలియదు. అందుకని ఫలాఫలాల వివరాలు కచ్చితంగా తెలుసుకోవాలంటే ప్రత్యక్షంగా స్థల దర్శనం చేసి చెప్పటం ఉత్తమం.

### ముఖద్వార యోగమంటే?

కనకదుర్గ- అమలాపురం

**ప్రశ్న: నాకు ఏ ముఖ ద్వార గృహం యోగిస్తుంది? ముఖ ద్వార యోగం అంటే ఏమిటి?**

**జవాబు:** మీకు, మీ వ్యవహార నామరీత్యా దక్షిణ ముఖద్వార యోగం ఉంటుంది. ఒక వ్యక్తికి ఏ ముఖ ద్వారం గృహంవలన మంచి ఫలితాలు సులభంగా అందుతాయో ఆ ముఖ ద్వార గృహంలో నివసించవలసి రావటం శుభ ఫలితాలు అనుభవించగలగటమే 'ముఖ ద్వార యోగం'గా చెప్పుకోవచ్చు.

### ఈశాన్య గది ఖాళీగా ఉండొచ్చా!?

గోవర్ధన్ - నల్గొండ

**ప్రశ్న: మా నాన్నగారు 1999లో ఇల్లు కట్టారు. స్వతహాగా తాపీమేస్త్రీ కావడంతో ఎవరి సలహా తీసుకోకుండా ఇంటిని కట్టారు. ఈశాన్యం గదిని కట్టకుండా ఖాళీగా వదిలేసారు. అదేవిధంగా బాత్ రూమ్ మీదుగా మెట్లు కట్టారు. మూసిన బాత్ రూమ్‌లో స్నానాలు చేయవచ్చా? వేరొక బాత్‌రూమ్ ఆగ్నేయాన్ని ఆనుకొని కట్టారు. వాస్తు ప్రకారం ఏదయినా దోషముందా? దేవుని గది ఎక్కడ వుండాలి?**

**జవాబు:** ఈశాన్య గది నిర్మాణం చేయకుండా వదిలిపెట్టడం వలన ఇల్లు కట్టిన స్థలానికి ఈశాన్య లోపం ఏర్పడింది కాబట్టి ఈశాన్య గదిని కూడా నిర్మించి ఆ ఇంటికి పరిపూర్ణ స్వరూపాన్ని తీసుకురండి. ఆగ్నేయాన్ని మూత వేస్తూ నిర్మించిన లెట్రిన్, బాత్ రూమ్స్‌ని నిర్మూలించి ఆగ్నేయ దిశకి తెరిపి గావించండి. ఆగ్నేయపు మెట్లకింద బాత్‌రూమ్, వంటగది వుండకూడదు. ఇంట్లో ఆగ్నేయ గదిని వంటగదిగా ఉపయోగించుకోవటం ఉత్తమం. ఇంటి తూర్పు ప్రహరీగోడకి దూరంగా, మెట్లకి దగ్గరగా, దక్షిణ ప్రహరీ గోడనాను కొని బాత్ రూమ్స్ నిర్మించుకోవచ్చు. సూచించిన వంట గదిలో ఈశాన్య మూలన నిలబడి పూజ చేసుకోవచ్చు.

దేవుని పటాలు మీ దృష్టికెదురుగా వచ్చేట్లు షెల్ఫ్ నిర్మించుకోండి. ఏది ఎక్కడ నిర్మించాలో చెప్పేది వాస్తు శాస్త్రం. ఏది ఎలా నిర్మించాలో చెప్పేది నిర్మాణ శాస్త్రం. అందుకని నిర్మాణ శాస్త్రానికి సంబంధించిన తాపిమేస్త్రి అయినాసరే, సివిల్ ఇంజినీరు అయినాసరే వాస్తు విషయంలో మాత్రం వాస్తు నిపుణుడి సలహా తీసుకోవాలి. వాస్తు నిపుణుడు కూడా నిర్మాణ విషయమై సాంకేతికంగా సివిల్ ఇంజినీరు సలహా పొందాల్సి వస్తుంది. ■

---

వాస్తువిద్వాన్ డా॥ దంతూరి పండరినాథ్ పాఠకుల సమస్యలకు ఆదివారం 'వాస్తువార్త'లో సమాధానాలిస్తారు. ఈ కింది కూపన్ జతచేసి సమస్యలు పంపవలసిన చిరునామా: సాయిశ్రీ వాస్తు కన్సల్టెన్సీ, 3-2-4, కింగ్స్‌వే, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్-3

వాస్తువార్త

పూర్తి పేరు: ------------------------------------
పుట్టినతేదీ:------------------ ఊరు: -------------
జన్మనక్షత్రం:---------తల్లిపేరు:--------------------
చిరునామా: ---------------------------------
------------------ ఫోన్: --------------------

